శ్రీః

# అక్షర సమామ్నాయము

రచయిత:

వేదాంతపారీణ, వ్యాకరణవిద్యాప్రవీణ,
ఉభయభాషాప్రవీణ,
ఓరుగంటి నీలకంఠశాస్త్రి.



శ్రీసదనము,
గుంటూరు.



బెజవాడ
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.
1936

 [వెల నాలుగణాలు

శ్రీః.

# అభిజ్ఞులకొక మనవి

సర్వశక్తియుతుండగు భగవంతునిచే మానుష వ్యవహారంబుకొఱకు భాష సృజింపఁబడెను. మానుషవ్యవహార యోగ్యంబగు నీభాష స్పష్టధ్వన్యాత్మకము. వివిధదేశంబులయందు వివిధంబులగుభాషలు వ్యవహరింపఁబడుచున్నను సాక్షాత్తుగాఁగాని పరంపరగాఁగాని దేవభాషయగు సంస్కృతభాషను నన్నిభాషలును సంబంధించియేయున్నవి. న్యాయదృష్టితోఁ బరిశీలించిన నీసంస్కృతభాషయందలి వాఙ్మయవిస్తృతి భాషాసౌందర్యము మొదలగు ననేక సుగుణములను మఱి యేభాషయందును గానము. కావుననే యియ్యదిభాషలన్నింటిలో భిన్నమై దేవభాష నానొప్పె. ఇయ్యది పరమేశ్వరముఖమునుండి వెలువడిన వేదరాశిరూపమును దాల్చుటచే "వైదికభాష"యనియు నవరసపూరితములగు కావ్యములయందు నిబద్ధంబగుటంజేసి 'లౌకికభాష'యనియు వ్యవహారమును గనుచున్నది.

భాషామతల్లికయగు నీసంస్కృతభాషను నెన్నియో వ్యాకరణములు బయల్వెడలినవి. అందులకుఁ గారణము సంస్కృతభాషావిస్తారము. అందు ముఖ్యములైనవి తొమ్మిదివ్యాకరణములని నేఁటికిని మనవారిచేఁ బరిగణింపఁబడుచున్నవి. "ఇంద్రశ్చంద్రః కాశకృత్స్నాపిశలీ శాకటాయనః, పాణిన్యమరజైనేంద్రా జయన్త్యష్టాదిశాబ్దికాః." వీనియందు నిఖిలవాఙ్మయంబును గూలంకషముగా సాధించుటంజేసి పాణినీయము మిగుల ప్రసిద్ధిఁగాంచినది. ఇయ్యది యొకవైపు లౌకికభాషను సంపూర్ణముగ శాసించుచు వేఱొకవైపున వైదికభాషను జేరఁదీసినది. ఇద్దానికిఁ బ్రధానులు పాణినికాత్యాయనపతంజలులు మువ్వురని 'త్రిముని వ్యాకరణమ్'ను నానుడిచే సువ్యక్తంబగుచున్నది.

సాధారణముగా భాష వాక్యరూపగాను వాక్యములు పదరూపములుగాను పదములు వర్ణరూపములుగాను నుండుటచే వ్యాకరణము వర్ణముల నాధారముఁజేసికొని ప్రవర్తించును. గ్రంథరూపమునొందిన భాషను దెలిసికొనుటకు వర్ణజ్ఞాన మత్యావశ్యకము. కావుననే బాలురకుఁ దొలుతనే యక్షరాభ్యాసము ప్రారంభమైనది. ప్రకృతమునఁ బాణినీయమున నాశ్రయింపఁబడిన యక్షరసమామ్నాయము బహు విచిత్రమైనది. ఇయ్యది పాణినిమహర్షికిఁ దనతపోమహిమవలన నటరాజమూర్తినుండియుపలబ్ధమాయెను. కావున నిది మాహేశ్వరాక్షరసమామ్నాయమని వ్యవహరింపఁబడుచు చతుర్దశసూత్రాత్మకమై యొప్పుచున్నది. ఇందు వర్ణస్వరూపములు నిత్యసంజ్ఞావర్ణములుదక్క వేఱొండు మనకుఁ గన్పట్టదు. సంపూర్ణ సంస్కృతభాషాసాధకమగు పాణినీయమే తదుపాదానకము.

పాణిని మహర్షికిఁ బూర్వమునఁగూడ నొక యక్షర సమామ్నాయమున్నట్లు మనకుఁ దెలియుచున్నది. అయ్యది సాధారణముగా మనము వ్యవహరించుకొనునదియేయని "అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః" అను సూత్రమునందలి యుదిత్కరణమువలనఁ దెలియుచున్నది. దీనినే నారాయణ సమామ్నాయమని శిష్టులు వ్యవహరింతురు.

కాని యిట్టి ప్రసిద్ధతరంబగు నీ నారాయణ సమామ్నాయము పాణినిమహర్షిచే నాయొక్క సూత్రమునందే సూచింపఁబడెనా లేక పాణినీయంబునకు మూలభూతంబగు పదునాల్గుసూత్రములయందుఁ జెప్పఁబడిన సూచింపఁబడెనా యనునది ప్రధానతమంబగు విషయము. పాణినీయ వ్యాఖ్యాతలందఱు నీవిషయ మించుకేనియు స్పృశింపలేదు. వారు తచ్ఛాస్త్రప్రయోగికంబులగు నిత్యసంజ్ఞా ప్రత్యాహారములకుమాత్ర మయ్యది యుపయుక్తమగునని చెప్పిరి. పరిశీలింపఁగా నీమహోత్కృష్టంబగు మాహేశ్వర చతుర్దశ సూత్రియందు నంతకుమున్నే ప్రసిద్ధిగాంచిన నారాయణసమామ్నా

యము తప్పక సూచితమగు ననుదృష్టితో నాలోచింప నొకప్రస్థానము గోచరమైనది. అంతియగాక. మాహేశ్వర సమామ్నాయమునందలి క్రమనిబంధనము నాలోచింప వర్గములకుఁ బరస్వరముందు కంఠతాల్వాది స్థానసంబంధము కూడ నారాయణసమామ్నాయముతో సూచింపఁబడుననుట సువ్యక్తము. అయ్యదియే యీ గ్రంథమునందు నిరూపింపఁబడిన విషయము.

గంభీరార్థ సంయుతమగు నీచతుర్దశసూత్రియందు స్వస్వప్రతిభా విభానములచే వివిధ విచిత్రార్థములు గోచరములగుచుండును. అందు మాకొకరీతి పొడగట్టినది. గుణదోషవిమర్శము పండితులకర్తవ్యము. శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకరపదమూల వేశప్రకాశిత జగద్గురు శ్రీ కల్యాణానందభారతీమహంతాచార్య మహాస్వామి పాదులవారి యఖండజ్ఞానభాస్కరుని కిరణలేశము నాయందుఁ బ్రసరించుటచే నిద్దానిని బ్రకాశింపఁజేసితిని. కావున బుధులు,

"గుణదోషౌ బుధో గృహ్ణ న్నిందుక్ష్వేళా వివేశ్వరః,
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి."

అను నార్యోక్తి ననుసరింతురని విశ్వసించుచున్నాను.

ఇట్లు,
బుధజనవశంవదుఁడు,
నీ ల కం ఠుఁ డు.



# అక్షరసమామ్నాయము

శ్రీః

శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్।
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే॥
కామేశ్వరీం పరామీడే కాదిహాదిస్వరూపిణీమ్।
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్॥

అక్షరసమామ్నాయమును గుర్తెఱిగి విమర్శించి తత్త్వమును దెలిసికొనినచో నక్షరరూపమగు బ్రహ్మభావము లభించును. అట్టిలాభముచేఁ బరమపురుషార్థమగు మోక్షము చేకూరును. కావున నక్షరసమామ్నాయము విమర్శింపఁబడుచున్నది.

అక్షరసమామ్నాయ మనఁగా, అకార మాదిగాఁగల్గి 'క్ష' కార మంతముగాఁగల్గిన యక్షరములసముదాయమని సుప్రసిద్ధమగు వ్యవహారము. ఈ వ్యవహారము లోకమునందు వేదమునందును దెలియవచ్చుచున్నది. కాని యట్టి, 'అ' కార 'క్ష' కారములమధ్యను దెలియవచ్చెడి వర్ణము లెయ్యవి? అయ్యవి యేక్రమమున నలరారుచున్నవి? అట్టిక్రమమునందుఁ గల విశేష మెట్టి? అను విషయములు పలువిధములగు సందియముల కాస్పదములగుటం జేసి యట్టి సందేహనివృత్తికి నిదానముగ విచారణ మావశ్యకమగుచున్నది. విచారణముచే సందేహనివృత్తి కాఁగా నిశ్చితజ్ఞానము గల్గునుగదా?

శ్రుతియందు ననఁగా నక్షమాలికోపనిషత్తునందుఁ దెలియవచ్చెడి యక్షరసమామ్నాయ మిట్లు పరఁగుచున్నది.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః॥

క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ,

య ర ల వ శ ష స హ ళ క్ష॥ అని.

ఇందు అకార మాదిగాఁ గల్గి 'ళ'కార మంతముగాఁ గల్గిన యేఁబదివర్ణములును బ్రత్యేకముగా నేఁబదియంకెలచే లెక్కింపఁబడి 'క్ష'కారము మాత్రమే యంకెచేఁ గూడ లెక్కింపఁబడక వర్ణింపఁబడినది. దానంజేసి యక్షరసమామ్నాయమును వర్ణించువిబుధులోక మెల్లెడల క్షకారముతోఁ గూడిన వర్ణసముదాయమును వర్ణించునపు డందలివర్ణములను బంచాశచ్ఛబ్దముచేతనే గణన సేయుచున్నట్లు తెలియవచ్చుచున్నది కాని వ్యావహారికదృష్టిచేఁ జూచినచో నక్షమాలికయందుఁ బేర్కొనఁబడిన యక్షరసమామ్నాయ మేఁబదియొక్క వర్ణములతో నొప్పుచున్నట్లు సువ్యక్త మగుచున్నది. ఇట్టి యక్షరసమామ్నాయమును భాషాతత్త్వవిశారదులు కూటములుగ విభజించిరి. ఎట్లన,

(1) అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః

2. క ఖ గ ఘ ఙ
3. చ ఛ జ ఝ ఞ
4. ట ఠ డ ఢ ణ
5. త థ ద ధ న
6. ప ఫ బ భ మ
7. య ర ల వ
8. శ ష స హ
9. ళ క్ష అని.

ఇట్టి విభాగమునకు నిదానము "అకచటతపయశాన్ సృజతే" అను శ్రుతివాక్యము. ఈ శ్రుతివాక్యముచే నభిప్రేతములగునవి నలువదితొమ్మిది వర్ణములు మాత్రమే యని 'ళ క్ష' వర్ణములను విడచి భాషాతత్త్వవిశారదులు గ్రహించుచున్నట్లు స్పష్టమగుచున్నది. దానంజేసి 'ళ క్ష' యనురెండు వర్ణములతోఁగూడిన తొమ్మిదవకూట మొకటి యుపేక్షింపఁబడుచున్నట్లు తెలియవచ్చుచున్నది.

ఇఁక నీకూటములయందలి విశేషమును దిలకించినచో నీకూటవిభాగ మానుషంగికము గాక సహజమగు విశేషములతోఁ నొప్పుచున్నట్లు తెలియవచ్చెడిని. అదెట్లనిన, మొదటి కూటము-"అఆ ఇఈ ఉఊ ఋౠ ఌౡ ఏఐ ఓఔ అంఅః" అనునది.

ఇందలి పదాఱు వర్ణములలో స్వోచితమగు నుత్పత్తిస్థానమునుబట్టి,

(1) "ః అఆ, (2) ఇఈ, (3) ఉఊ, (4) ఋౠ, (5) ఌౡ (6) ఏఐ (7) ఓఔ (8) అం"

అను నెనిమిదివిభాగములు చేయనొప్పును. స్వోచితోత్పత్తిస్థాన మనఁగా విసర్గమునకు 'అఆ'లకుఁ గంఠము, ఇఈలకుఁ దాలువు, ఉఊలకు నోష్ఠము, ఋౠలకు మూర్ధము, ఌౡలకు దంతములు, ఏఐలకుఁ గంఠతాలువులు, ఓఔలకుఁ గంఠోష్ఠములు, అనుస్వారమునకు నాసికయును స్థానమని భావము.

ఇఁక 'యశ' వర్గములకుఁ జెందిన 'యరలవ' 'శషసహ' లలో స్వోచితోత్పత్తిస్థానమును బట్టి (1) "హ, (2) యశ, (3) వ, (4) రష, (5) లస" యను నైదువిభాగములు చేయవచ్చును. అనఁగా 'హ'కారమునకుఁ గంఠము, 'యశ'లకుఁ దాలువు, 'వ, కారమునకు (దంత) ఓష్ఠము, 'రష' లకు మూర్ధము, 'లస'లకు దంతములు స్థానములని తెలియునది.

ఇఁక స్పర్శము లను పేరఁ బరఁగు కాదిమాంతవర్ణములన్ననో సామాన్యముగా నైదువర్గములుగా నిదివఱలోఁ బరఁగుచున్నది. వస్తుస్థితిని గమనించినచో మాత్రమీ వ్యాప్తిని నాఱువర్గములుగా విభజింపవచ్చును. ఎట్లనిన,

1. క ఖ గ ఘ
2. చ ఛ జ ఝ
3. ప ఫ బ భ
4. ట ఠ డ ఢ
5. త థ ద ధ
6. ఙ ఞ మ ణ న- అని.

ఈ వర్గములుకూడఁ, బై రీతిని స్వోత్పత్తిస్థానమునుబట్టి భేదమును గనుచున్నవి. ఎట్లనిన - 'క ఖ గ ఘ' లకుఁ గంఠము, 'చ ఛ జ ఝ' లకుఁ దాలువు, 'ప ఫ బ భ' లకు నోష్ఠము, 'ట ఠ డ ఢ' లకు మూర్ధము, 'త థ ద ధ' లకు దంతములు, 'ఙ ఞ మ ణ న' లకు నాసికయును స్థానములుగాఁ బరఁగుచున్నవి. ఇందలి 'ఙ ఞ మ ణ న' లన్ననో స్వోత్పత్తిస్థానమును బట్టి నాసిక ప్రధానముగాఁగలిగి యున్నట్లుఁ దలంపఁబడుచున్నవి. ఇంతియకాదు. ఇవి నాసికస్థానముగాఁ దలంపఁబడు బిందువుయొక్క స్థానమునఁ దద్వికృతులుగ నేర్పడుచు బిందుస్థానముననే యుత్పన్నములగుచున్నవి. బిందు-వన్ననో వ్యాప

హారమునందు 'ఙ ఞ మ ణ న' రూపములఁ బొందుచుండుటఁ జేసి ప్రత్యేకముగా వ్యవహారమును బొందియున్నట్లగపడదు.

వ్యవహారమునందు బిందువు 'ఙ ఞ మ ణ న' ల భావమును బొంది లుప్తమగుచుండఁ దత్సజాతీయముగఁ దోఁచునట్టి (ః) విసర్గముకూడ నట్టి పరిణామమును బొందునను నాశంక గలుగ నట్టి విసర్గము 'హ' కారముగఁ బరిణమించి లుప్తమగుచున్నదని నిస్సందేహముగఁ జెప్పఁదగును. వ్యవహారమునందు బిందు విసర్గములు వికృతిభావమును జెంది లుప్తమగుచో లిపియందు నవ్యానిస్వరూపము ప్రత్యక్షమగుచున్నదే యనిన - సయ్యాది మకారనకారములుగల శబ్దములకే తెలియవచ్చుటంజేసియు లేఖనసౌకర్యమునకై యట్లు వ్యవహరింపఁబడుచుండుటంజేసియు సయ్యాది వ్యవహారమునందు బిందువిసర్గములయావశ్యకతను సాధింప నేరదు.

కావున బిందువిసర్గములు రెండును వ్యవహారాతీతములగుచుండుటచే భాషావ్యవహారమునుండి విలక్షణముగ నిలిచి యుండుటకుఁ దగుయోగ్యతను గల్గియున్నట్లూహింపవచ్చును. దానంజేసి బిందువిసర్గములు రెండును 'ఁః' అను వర్ణములతోఁ దుల్యముగుస్థితిని బడసియున్నట్లు నిశ్చయింపవచ్చును.

ఇఁక భాషతోఁ సంబంధించిన వర్ణములను లెక్కించినచోఁ నయ్యవి,

అఆ ఇఈ ఉఊ ఋౠ ఌౡ ఏఐ ఓఔ కఖ గఘ చఛ జఝ పఫ బభ టఠ డఢ తథ దధ ఙఞ మణన హ యశ వ రష లస.

అను నలుబదియేడు వర్ణములుగా నున్నట్లు స్వూత్రిగలుగు చుండును. ఈవర్ణములను స్వోచ్ఛోత్పత్తిస్థానముల ననుసరించి విభాగమును గావించినచో,

(1) అఆ, కఖగఘ, హ॥ (2) ఇఈ, చఛజఝ, యశ॥ (3) ఉఊ, పఫబభ, వ॥ (4) ఋౠ, టఠడఢ, రష॥ (5) ఌౡ, తథదధ, లస॥ (6) ఏఐ॥ (7) ఓఔ॥ (8) ఙఞమణన॥ అను నెనిమిది వర్గములుగా విభాగయోగ్యము లగుచున్నవి.

ఇందొకవిశేషము గలదు. దంత్యములుగాఁ దలంపఁబడు "ఌౡ తథదధ లస" యను నెనిమిదింటిలో 'ఌౡ' యను రెండువర్ణములు గూడ భాషయందుఁ బ్రచారములను గల్గియుండలేదని భాషాకోవిదుల కెంతయు సుప్రసిద్ధముగు విషయము. దానంజేసి భాషయందు వ్యవహరింపఁబడు వర్ణములు:

అఆ కఖ గఘ హ, ఇఈ చఛ జఝ యశ, ఉఊ పఫ బభ వ, ఋౠ టఠ డఢ రష, తథ దధ లస, ఏఐ, ఓఔ, ఙఞ మణన, అను నలువదియైదుగాఁ దెలియవచ్చుచున్నవి.

వేఱొకవిశేషము - పై నలువదియైదు వర్ణములయందును, ఆఈఊౠఅను దీర్ఘములుగూడఁ గ్రమముగ 'అఇ ఉఋ' అను వర్ణములయొక్క విశేషములే యగుటంజేసి 'అఇ ఉఋ' అనువర్ణములు గ్రహింపఁబడినచో గతార్థములే యగుచున్నవి. కావున నక్షరసమామ్నాయమునుండి దీర్ఘాక్షరములను గ్రహింపకపోయినను గ్రహింపకపోవచ్చును. అట్లు దీర్ఘాక్షరములను సంకోచించినచో నక్షరసమామ్నాయము:

(1) అ క ఖ గ ఘ హ॥ (2) ఇ చ ఛ జ ఝ య శ॥ (3) ఉ ప ఫ బ భ వ॥ (4) ఋ ట ఠ డ ఢ ర ష॥ (5) త థ ద ధ లస॥ (6) ఏఐ॥ (7) ఓఔ॥ (8) ఙ ఞ మణన॥ అను నెనిమిది వర్గములుగా నలరారుచు నలుబదియొక వర్ణములతో నొప్పును. ఇయ్యెది వర్ణములయొక్క స్వోచితోత్పత్తి స్థాన క్రమము ననుసరించి ప్రదర్శింపఁబడిన వర్గక్రమవిభాగము. ఇందలివర్ణములను సుప్రసిద్ధమగు పాఠముతో ననుగుణముగఁ బ్రదర్శించినచో నీయక్షరసమామ్నాయ మిత్తెఱఁగునఁ బరఁగు చున్నది.

"అ ఇ ఉ ఋ ఏ ఐ ఓ ఔ క ఖ గ ఘ, చ ఛ జ ఝ, ట ఠ డ ఢ. త థ ద ధ, ప ఫ బ భ, ఙ ఞ ణ న మ, య ర ల వ శ ష స హ"

ఇట్టీయక్షరసమామ్నాయ మకార మాదిగాఁ గల్గి 'హ'కార మంతముగాఁ గల్గి మామూలుగా నలరారుచున్నది. ఇట్లీనలునదియొక యక్షరములతోఁ గూడిన యక్షరసమామ్నాయముచే భాష చరితార్థమగుచుండ భాషాతత్త్వ విశారదుఁడగు వరరుచి—

"ద్విధాఽక ఏచోఽనుస్వారో విసర్గష్షోడశస్వరాః
స్పర్శా అంతస్థోష్మాణశ్చతుస్త్రింశద్ధలః స్మృతాః"

అని యక్షరసమామ్నాయమునందు,

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః

కఖ గఘ ఙ, చఛ జఝ ఞ, టఠ డఢ ణ, తథ దధ న, పఫ బభ మ,

య ర ల వ శ ష స హ ళ.

అనువర్ణములు సంస్కృత భాషానిష్పాదకములని నిర్వచించి యున్నారు. ఇట్లు నిర్వచించుటయే కాదు. ఇట్టి క్రమముకూడ సిద్ధమగు క్రమమే యనియు నట్టిక్రమముచే భాషయందలి శబ్దములకుఁ దత్త్వార్థ నిధనమునందుఁ గల యన్యోన్యసంబంధమును బోధించుసంఖ్యాసంకేతములుగూడ నలరారుచున్నదనియు, "కాదినవ, టాదినవ, పాదిపంచ, యాద్యష్ట" యనువాక్యములచే నుపదేశించియున్నారు. అనఁగాఁ గటపయ' వర్ణము లేకత్వసంఖ్యను బోధించు సంకేతము, 'ఖఠఫర' యనునాల్గువర్ణములు ద్విత్వసంఖ్యాబోధకమగు సంకేతము, 'గడబల' యను నాల్గువర్ణములు త్రిత్వార్థబోధకమగు సంకేతము నట్లే 'ఘఢభవ' యను వర్ణములు నాలుగవయంకెను, 'ఙణమశ' యనువర్ణము లయిదవయంకెను 'చతేష' యను వర్ణము లాఱవయంకెను 'ఛధస' యనువర్ణము లేడవయంకెను, 'జదహ' యనువర్ణము లెనిమిదవయంకెను, 'ఝనళ' వర్ణములు తొమ్మిదవయంకెను, 'ఞన' వర్ణములు సున్న (౦)ను బోధించుచున్నవని తాత్పర్యము. సిద్ధమగు నక్షరసమామ్నాయమునకును నంకెలకును నిందుఁ బ్రదర్శింపఁబడిన సంబంధము శాస్త్రసిద్ధమగు నవినాభావరూపసంబంధమే గాని కల్పనామాత్రమెంతమాత్రము గాదని తత్త్వజ్ఞులయాశయము. ఇట్టి యాశయమునే 'వాగనుశాసనుఁడ' ని ప్రసిద్ధిగాంచిన నన్నయభట్టారకుఁడు గూడ "ఆద్యాయాః పంచాశద్వర్ణా" యను సూత్రముచే వ్యక్తీకరించినాఁడు.

దీనినిబట్టి పదునాలు స్వరములతోడను, నిరువదియైదు స్పర్శములు, నాలుగంతస్థవర్ణములు, నాలు గూష్మవర్ణములు, నొక ళవర్ణమును గల ముప్పదినాలుగుహల్లులసముదాయము తోడను వర్ణసమామ్నాయము కూడియున్నట్లు సువ్యక్త మగుచున్నది. ఇందు 'క్ష' కారమునకుఁ బ్రసక్తి యెంతమాత్రము గానరాదు. ఇందులకుఁ గారణ మక్షమాలికోపనిషత్తునందు 'క్ష' కారము 'అకారాది' 'ళ' కారాన్తవర్ణములతో సమానముగ లెక్కింపఁబడక ప్రత్యేకముగ నుపదేశింపఁబడుటయే యని యూహింపనొప్పును.

ఇట్టి యక్షరసమామ్నాయ మనాదికాలమునుండి ప్రచారమును గనుచుండ వైయాకరణ సార్వభౌముఁడగు పాణిన్యాచార్యునికి మహేశ్వరానుగ్రహమువలన నొకయక్షర సమామ్నాయము లభించుటయు నయ్యది పాణిన్యాచార్యునిచే రచింపఁబడిన యష్టాధ్యాయీరూపమగు మహావ్యాకరణము నకు శిఖామణిగ నలరారుచుండుటయు నెల్లరకును దెలిసిన విషయమే. పాణినికి మహేశ్వరునివలన లబ్ధమైన యక్షర సమామ్నాయమున్నదో పదునాల్గుసూత్రములుగా నొప్పుచున్నది.

(1) అఇఉణ్ (2) ఋఌక్ (3) ఏఓఙ్ (4) ఐఔచ్ (5) హయవరట్ (6) లణ్ (7) ఞమఙణనమ్ (8) ఝభఞ్ (9) ఘఢధష్ (10) జబగడదశ్ (11) ఖఫఛఠథచటతవ్ (12) కపయ్ (13) శషసర్ (14) హల్॥

ఇందుఁ దొలినాల్గుసూత్రములచే "అఇఉఋఌఏఐఓఔ" అను తొమ్మిదిస్వరము లుపదేశింపఁబడుచున్నవి. మిగిలిన పదిసూత్రములచేతను ముప్పదిమూఁడుహల్లులు మాత్రమే యుపదేశింపఁబడుచున్నవి. దీనిని బట్టి ప్రాచీనసమామ్నాయముకంటె నచ్చులలో "ఆ, ఈ, ఊ, ౠ, ౡ, అనుస్వారము, విసర్గము" నను నేడు స్వరములును, హల్లులలో 'ళ' యను వర్ణమును నుపదేశింపఁబడియుండలేదు. కాని హకారము రెండుసారు లుపదేశింపఁబడుటచే నుపదేశింపఁబడిన హల్లులసంఖ్య ముప్పదినాల్గుగా నలరారుచుఁ బ్రాచీన సమామ్నాయపు హల్లులసంఖ్యతోఁ సామ్యమును జెందియున్నది. ఒకవేళ, 'ఆ ఈ ఊ ౠ (ౡ)' అను దీర్ఘస్వరమ్ములు, "అఇఉఋ(ఌ)" అను హ్రస్వములచే గతార్థము లగుచున్నవని తలంచినను ననుస్వారవిసర్గము లుపదేశింపఁబడ లేదని చెప్పనొప్పును గదా! దానం జేసి స్వరములసంఖ్యయందు రెండుసమామ్నాయములకును వైషమ్యము తప్పక తెలియనచ్చును.

ఇంతియకాదు. అచ్చులలో 'ఏ ఐ ఓ ఔ' యను నాల్గింటి యొక్క క్రమము 'ఏ ఓ ఐ ఔ' యని మాఱుటయే గాక హల్లులయందలి క్రమమంతయుఁ బుష్కలముగ మార్పుఁ జెందినది. కావున నీమార్పునందలి విశేషము లొకింత ప్రదర్శింపఁబడుచున్నవి.

1. అ ఇ ఉ ణ్.

ఇందలి 'అ ఇ ఉ' అను మూఁడువర్ణములకును వివృతమే ప్రయత్నమైనను స్థానభేదముండుటవలన సావర్ణ్యము

లేకపోవుటచేఁ బ్రత్యేకముగా గ్రహింపఁబడుచున్నవి. ఇందు అకారమునకుఁ గంఠము, ఇకారమునకుఁ దాలువు, ఉకారమునకు నోష్ఠమును స్థానములుగాఁ దెలియవచ్చుచున్నవి. స్థానమనఁగా వాక్ప్రసారమునకు నిదానమగు నాలుక యేస్థానముతో సంబంధించినపుడు వర్ణములు వినఁబడునో యయ్యది యావర్ణమునకు స్థానమని యభిప్రాయము. అకారమునకుఁ గంఠము స్థానమన నాలుక కంఠమువైపు సంకోచమును జెంద వివృతప్రయత్నముచే అకారము వినవచ్చునని భావము. ఇఁకఁ దాలువు స్థానమన్ననో నాలుకకొన తాలువుయొక్క మధ్యభాగమునకుఁ బ్రసరింపగాఁ బ్రయత్నవిశేషముచే వినవచ్చెడి వర్ణములకుఁ దాలువు స్థానమని యభిప్రాయము. ఇకార మను స్వరము పైతీరున వివృతప్రయత్నముచే వినవచ్చుచున్నది. ఇఁక నోష్ఠము స్థానమన్ననో నాలుకకొన పెదవులతో సంబంధించుచున్నదని యభిప్రాయము. ఉకారము నాలుకకొన పెదవులతో సంబంధింప వివృతప్రయత్నముచే వినవచ్చెడి స్వరము కావున నుకారమునకు నోష్ఠము స్థానమని చెప్పఁబడుచున్నది. ఈ మూఁడు స్వరములును గ్రమముగాఁ గంఠతాలోష్ఠములందు వివృతప్రయత్నముచే స్ఫుటముగ వినవచ్చెడి వర్ణములు.

కంఠము, తాలువు, ఓష్ఠ మను మూఁడుస్థానములయందు వినవచ్చెడి వర్ణములకు స్థానగతభేదము స్ఫుటముగఁ దెలియవచ్చుచుండును. ఇది యట్లుండ నిఁక నొకవిశేషము గలదు. ఈ మూఁడువర్ణములను గ్రమముగా నుచ్చరించు

నపుడు హృదయమునుండి బయలువెడలు నొకనాద మా యా
స్థానములవఱకు వ్యాపించుచు వివృతప్రయత్న విశేష
ముచే వినవచ్చుచున్నట్లు శ్రోత్రబుద్ధికిఁ బొడగట్టుచుండును.
నాదమనఁగా సామాన్యావస్థారూపమగు వాక్కని యభిప్రా
యము. స్ఫుటములగు మూఁడుస్థానములయందును వినవచ్చెడి
మూఁడుస్వరములును మొదటిసూత్రముగ మహేశ్వరునిచే
నుపదేశింపఁబడెననెడివిశేష మీ సూత్రముచేఁ దెలియవచ్చు
చున్నది.

ఇఁక నీ సూత్రమం దుపదేశింపఁబడిన మూఁడు స్వర
ములను బ్రత్యేకప్రత్యేకముగా "ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః"
(పాణి. 1-2-27) "ఉచ్చైరుదాత్తః" "నీచైరనుదాత్తః" "సమా
హారః స్వరితః" (పా 1-2-29,30,31) 'ముఖనాసికావచనోఽను
నాసికః' (1-1-8) అను సూత్రములచేఁ బదునెనిమిది యకా
రములకును బదునెనిమిది యికారములకును బదునెనిమిది
యుకారములకును సంజ్ఞలుగా నుపదేశింపఁబడినట్లు శిష్టులచే
నిర్వచింపఁబడినది.

స్థానప్రయత్నభేదముచే నాదము వర్ణరూపమును
బొందుచున్నదని చెప్పఁబడియె. అందు వివృతప్రయత్నముచే
నీయకారేకారోకారములు వినవచ్చుచున్నవనియుఁ జెప్పఁ
బడియె. ఈ సందర్భమునఁ బ్రయత్నాంతరభేదకథన మన
సరముకావున నయ్యది కొంచెము నిరూపింపఁబడుచున్నది.

ప్రయత్నము (ఆభ్యంతరము) వివృతమనియు సంవృత
మనియు స్పృష్టమనియునీషత్ స్పృష్టమనియు నాల్గువిధములుగఁ

తెలియవచ్చుచున్నది. ఈనాల్గింటిలోఁ బ్రకృతమున ముచ్చటించఁబడిన మూర్ధన్యవర్ణములకును వివృతప్రయత్నమని చెప్పఁబడియును. ఇంకొక విశేషముగలదు. ఇకారోకారములకు వివృతప్రయత్నమునుగూర్చి వివాద మెంతమాత్రములేదు. అకారముయొక్క వివృతప్రయత్నమునుగూర్చి యొకింత విశేషము తెలియవచ్చుచున్నది. 'అఇఉణ్' అనుసూత్రమందు వినవచ్చెడి యకారమునకు వివృతప్రయత్నమే యని విచారణాపురస్సరముగ భాషాతత్త్వవిశారదులు నిర్ణయించియే యున్నారు. ఇట్టి వివృతప్రయత్నముతోఁగూడిన యకారము పదునెనిమిది యకారములకు నుపలక్షణముగ నుపదేశింపఁబడినట్లు గూడ వ్యవహారముగలదు. ఇదియటులుండ సంవృతప్రయత్నముతోఁ గూడిన యకారమొకటి యున్నట్లు "అ అ" (పా. 8-4-68) యను పాణినిగ్రంథాన్త్యసూత్రముచేఁ దెలియవచ్చుచున్నది. దీనినే "హ్రస్వస్యావర్ణస్య ప్రయోగే సంవృతమ్"ని శిష్టులు పేర్కొనుచున్నారు. అసలుగా నష్టాదశభేదములకు గ్రాహకము కాకుండ సంవృతప్రయత్నవిశిష్టమగు నొక యకారము వివృతప్రయత్నముతో నొప్పు నకారముకంటె విలక్షణముగ వివృతాకారము సావర్ణ్యము లేనిదై సిద్ధమై యున్నటులఁ దెలియవచ్చుచున్నది. ఈ సంవృతాకారము భాషయందు నిర్వికారముగ నిలిచియున్నట్లు "పూర్వత్రాసిద్ధమ్" (పాణి. 8-2-1) అను సూత్రముచే స్పష్టీకరింపఁబడుచున్నది. ఇంతియు కాదు. "అక్షరాణామకారోఽస్మి" యను నీశ్వరవచనముచేతను,

"అకారః సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమేశ్వరః।
ఆద్యమన్త్యేన సంయోగాదహమిత్యేవ జాయతే॥

యను శిష్టస్మృతిచేతను సంవృతాకారము పరమేశ్వర రూపముగా స్మరింపఁబడుచున్నట్లు సుస్పష్టము.

'అ ఇ ఉ ణ్' అనుసూత్రమునందు 'ణ' కార మంత్య వర్ణముగా నుపదేశింపఁబడి వైయాకరణులచేఁ బ్రత్యాహార సిద్ధికై యుద్దేశింపఁబడిన యిత్సంజ్ఞతో నొప్పుచున్నదనియుఁ దలంపఁబడుచున్నది. కాని యందొకవిశేషముకలదు. ప్రత్యాహారసిద్ధికై మాత్రమే యిత్సంజ్ఞావర్ణము లుచ్చరింపఁబడినచో నుచ్చరింపఁబడిన వర్ణములకు సార్థక్య మించుకేనియులేక యెట్లో యొకతీరున ననియతముగఁ బ్రత్యాహారవర్ణము లుండు నొప్పును. కాని మహేశ్వరముఖమునుండి వెలువడుటంజేసి యవ్వానియం దొకింత విశేషముండితీరవలయును. కావున నీఁణ' కారమువలనఁ దెలియవచ్చెడి విశేషము నొకింత విచారింతము.

కూటమునం దుచ్చరింపఁబడిన యచ్చులచే వర్ణోత్పత్తి స్థానములుగఁ గంఠతాలోష్ఠములు స్ఫూర్తికి వచ్చుచున్నవి. ప్రథమమున మూఁడుస్థానములు వినవచ్చుటఁజేసి వర్ణోత్పత్తి స్థానములు మూఁడా లేక యధికమా యను నాశంక కలుగ వచ్చును. అట్టియాశంకను వారించుటకై స్థానాంతరమును స్ఫుట ముగ భాసింపఁజేయునట్టిదియు నపూర్వములగు ధర్మములతో నొప్పుచున్నట్టిదియు నగు 'ణ' కార మిచట నుపదేశింపఁబడిన దని చెప్పవచ్చును. ఏలయన 'ణ' కారము నుచ్చరించునపుడు నాలుకచివర పై మూఁడుస్థానములనుండి స్పష్టముగ మఱియొ

యూర్ధ్వముగఁ దిరిగి యంగుటిని స్పృశించును. ఇట్లునాలుక యంగుటిని స్పృశించునప్పుడు తెలియవచ్చెడి స్థానము మూర్ధ మనియు నందుఁ బ్రయత్నవిశేషముచే వెలువడువర్ణములు మూర్ధన్యము లనియుఁ జెప్పఁబడును. ప్రకృతము మూర్ధస్థానమున స్పృష్టప్రయత్నముచే 'ణ' కారము వెలువడుటంజేసి ణకారోచ్చారణముచేఁ బ్రయత్నాంతరమగు స్పృష్టప్రయత్నమును స్థానాంతరమగు మూర్ధస్థానమును దెలియవచ్చుచున్నవి. కావున 'ణ' కారోత్పత్తివిశేషమును బట్టి తత్సజాతీయముగ వెలువడువర్ణము లన్నియు మూర్ధన్యములని స్పష్టమగును. అనఁగా నంగుటిభాగమునఁ బ్రయత్నవిశేషముచే నుత్పన్నములగువర్ణము లన్నియు మూర్ధన్యములని నిర్ణయింపవచ్చును.

ప్రకృతమున 'అఇఉణ్' సూత్రమును విచారింపఁగా వర్ణోత్పత్తికిఁదగు స్థానములగు కంఠతాలోష్ఠమూర్ధస్థానములును వివృతము స్పృష్టమను రెండు ప్రధాన ప్రయత్నములును స్ఫుటములగుచున్నవి.

2. ఋ ఌ క్.

ఇది రెండవ మాహేశ్వరసూత్రము. ఇందు 'ఋ ఌ' అను రెండుస్వరము లుపదేశింపఁబడుచున్నవి. ఈరెండువర్ణములకును ప్రయత్నము 'అ ఇ ఉ' లకు వలెనే వివృతమని స్ఫుటముగాఁ దెలియుచున్నది. కావునఁ బ్రయత్నమునుగూర్చి సందియములేదు. ఇఁక విసంవాద మెందుఁగలదనిన స్థానమును గూర్చియు వీనియావశ్యకతను గూర్చియును. ఇందుఁ బఠింపబడిన ఋకారమునకు 'అ ఇ ఉ' లకు వలెనే పదునెనిమిది విధము

లగు పరికారములు తెలియవచ్చుటంజేసి. యద్దాని యావశ్యకతనుగూర్చియు సందేహములేదు. కాని-‘ఌ’ కారమునకు భాషయందుఁ బ్రచారము తెలియమి ‘ఌ’ కారోపదేశమును గూర్చి విసంవాదమెక్కుడుగలుగుచున్నది. ఎట్లన- ఈసూత్రము నందలి ‘ఌ’ కారము హ్రస్వప్లుత ఌ కారములను సూచించుచున్నదని కొందఱును హ్రస్వదీర్ఘప్లుత ఌ కారములను సూచించుచున్నదని కొందఱును దలంచుచున్నారు. ఏలయన భాషయందుఁ బ్రచారములేని ఌ కార మిచటఁ గనఁబడుటయే విసంవాదమునకుఁ గారణము. ఌ కారము విమర్శకులు దలంచునట్లు దీర్ఘప్లుతములతోఁగాని దీర్ఘముతోఁగాని సంబంధము లేనిచో హ్రస్వముతో సంబంధింపని (ఏ ఓ ఐ ఔ లకుఁ బ్రత్యేకసూత్ర ముచ్చరింపఁ బడినట్లు ప్రత్యేకసూత్రముగా నుచ్చరింపఁబడియుండును. ఒకకూటమునఁ జేర్పఁబడిన పదార్థములకు సజాతీయధర్మ ముండి తీరవలయును గాని యత్యంత వైజాత్యముండుట యుక్తముగాదు. కావున ఋ కారముతోఁ జేర్పఁబడిన ఌ కారమునకు, ఌ కారముతోఁ జేర్పఁబడిన ఋ కారమునకు నేద్దియో సామాన్యమొకటి యుండి తీరవలయును. మొదటి కూటమువలనఁ దెలియ వచ్చెడి విశేషములను గమనించి యీ కూటమును గమనించినచో ఌ కారమునకు దీర్ఘము భాసించుటయే గాక యిందు వినఁబడు ఌ కారము పదునెనిమిది ఌ కారములకు గ్రాహకముగా నుచ్చరింపఁ బడినట్లు నిశ్చయింపనగును. భాషయందు నించుకేనియుఁ బ్రచారములేదని తెలిసికొని ఌ కారమునకు

హ్రస్వప్లుతములను సాధించువారలు దీర్ఘ మేల సాధింపఁబడ లేదను ప్రశ్నమునకు బాధ్యులు. ఌ కారము సంధ్యక్షరముగాక యకారాదులవలెఁ గేవలము స్వరమాత్రమే యై యుచ్చరింపఁబడుచుండ నకారాదులతో పాటు ఌ కారమునకుఁ గూడ దీర్ఘ మభిప్రేతము గాదనుట యుక్తిసహము గానేరదు గదా! కావున నకారాదులతో పాటు ఌ కారమునకుఁ గూడ దీర్ఘ మభిప్రేతమై యుండవలయును.

శ్రుతిచేఁ బఠింపఁబడినట్టిదియు, శిష్టులచే నక్షరసమామ్నాయమున వ్యవహారమును గనుచున్నట్టిదియు రహస్యవిదులచే సతతము పవిత్రముగ నెన్నఁబడుచున్నదియు నగు దీర్ఘ "ౡ" కారమును శివసూత్ర మభిప్రేతము గాదనుట శ్రుతిస్మృతిసదాచారవిరుద్ధము. కావున నిచటి 'ఌ' కార మకారాదులవలెఁ బదునెనిమిది ఌ కారములను గ్రహించునని తెలియునది. కావున శివసూత్రముచేఁ బదునెనిమిది ఋ కారములను బదునెనిమిది ఌ కారములను గూడ సూచింపఁబడుచున్నవని చెప్పుటయే యుక్తము.

ఇంతవఱకు ఋ ఌ వర్ణములయొక్క ప్రయత్నమును గూర్చియు విశేషములను గూర్చియు నిర్వచింపఁబడియె. ఇఁక స్థానవిశేషము విచారణీయము.

మొదటిసూత్రమువలన నాల్గుస్థానము లభిప్రేతములై యట్టి స్థానములయందుఁ దెలియవచ్చెడివర్ణములకు దృష్టాన్తము ప్రదర్శింపఁబడినది. ప్రకృతమున వినవచ్చెడి ఋ ఌ వర్ణములు పైస్థానములలో నెచ్చటనైనఁ దెలియవచ్చు

చున్నవా లేక వేఱొక స్థానమునఁ దెలియవచ్చుచున్నవా యను విషయమును విచారించిచూచిన, ఋ ఌ వర్ణములు రెండును పై స్థానములతో సంబంధము లేక నాలుకకొన స్థానాంతరములను స్పృశించుచుండ వివృతప్రయత్నముచే వినవచ్చుచున్నవని స్పష్టము. దంతస్థానమన్ననో దంతమూలమునుండి యంతమువఱకుఁ గల స్థానమని గుర్తెఱుఁగునది. ఈస్థానమొకింత మాంసముచేఁ గప్పఁబడియు నొకింత గప్పఁబడకయు నున్నది. నాలుకకొన మాంసముచేఁ గప్పఁబడిన స్థానమును స్పృశించుఁగాక, కప్పఁబడనిస్థానమును స్పృశించుఁగాక! ఏది యెట్లైనను దంతదేశము స్థానమే. అచటఁ దెలియఁబడువర్ణము లెవ్వియైనను దంత్యములే.

ఇఁకఁ బ్రకృతమున ఌ కారమును దంత్యమనుటయందు వివాద మెంతమాత్రము లేదుగదా! ఋ కార మేస్థానమున బయలువెడలుచున్నదనిన ణ కారము బయలువెడలు స్థానమున బయలువెడలుచున్నదని చెప్పుట కవకాశము చాలదు. ఏలయన, ఋ కారము నుచ్చరించుటయందు నాలుకయొక్క కొన ఌ కారోచ్చారణమునందువలె దంతస్థానమునే స్పృశించుచుండును గాని ణ కారోచ్చారణమునందువలె మూర్ధభాగమునుండి మరలి యంగుటి నెంతమాత్రమును స్పృశింపలేదు. కావున ఋ కారము ణ కారతుల్యముగాదు. అక్కారణముచే ఋ కారము మూర్ధన్యమని చెప్పుట కవకాశ మెంతమాత్రము చాలదు.

కాని ఌ కారసాహచర్యముచే దంత్యమని గ్రహించు

టకుఁ బున్కులమగున్నవకాశము గలదు. భాషయందు నించు కేనియుఁ బ్రచారమ్ము లేసట్టియు స్ఫుట మగు స్థానమును గల్గి యున్నట్టియు 'ఌ' కారమును ఋకారముతో సమకూర్చుటంజేసి ఋకారమునకు స్థానము నతిదేశించుటయు, దీర్ఘముతో నొప్పి యుండలేదని తలంపఁబడు ఌకారమును దీర్ఘముతోఁ గూడిన ఋకారముతోఁ బొందికచేయుటచే ఋకారమట్లు ఌకారమునకు దీర్ఘమును గ్రహించుటయుఁ బ్రయోజనముగాఁ గల్గి ఋ ఌ వర్ణములచే సూత్రమునందు సమకూర్పఁబడియున్నట్లు నిశ్చయింపనగును. ఇట్టియభిప్రాయమునుద్దేశించియే మహాశయుఁడగు వార్తికకారుఁడు 'ఋ ఌ వర్ణయోర్మిథః సావర్ణ్యం వాచ్యమ్' అను వాక్యమును స్మరించియున్నాఁడు. సావర్ణ్యము "తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్"(పాణి 1-1-9)అనుసూత్రముచే నిర్వచింపఁ బడుచున్నది. అనఁగా సమానస్థానమును సమానప్రయత్నమును గల్గిన వర్ణములకు సావర్ణ్యమనుధర్మము కల్గునని భావము. ఋ ఌ వర్ణములకు వివృతము ప్రయత్నముగదా? స్థానము గూడ దంతమే. దానంజేసియే యీరెండువర్ణములకును సావర్ణ్యము విధింపఁబడుచున్నది. కావున ఋ ఌ వర్ణములు రెండిటికిని దంతమే స్థానము.

ప్రాకృతమున "ఋ ఌ క్" అనుసూత్రముచే మూర్ధన్యములుగాఁ దలంపఁబడు ఋకారస్థానముచే ఌకారతుల్యము గాకపోవుటచేతను ఌ కారతుల్యమగుటచేతను దంత్యము గాని మూర్ధన్యముగాదని నిర్వచింపఁబడియెను.

ఇఁక పాణినిశిక్షను జూడ ఋకారము మూర్ధన్యముగ గానవచ్చుచున్నది. అపుడు ఋకారమునకు ౡకారముతో సావర్ణ్యము ఘటించుటకు నవకాశముచిక్కదు. ఈ రెండిటికిని సావర్ణ్య మున్నటుల శాస్త్రప్రక్రియవలనఁ దెలియవచ్చు చున్నది. సహజముగ సావర్ణ్యములేనిచో నాప్రక్రియ నెటుల నిర్వహింపనోపును? కావున నిట్టిలోపమును గమనించియే ఋౡ కారోచ్చారణస్థానములు సన్నికృష్టములగుటచే ఋకా రోచ్చారణభాగమునుగూడ దంతస్థాన భాగములో నొక భాగముగా నూహించి యీవర్ణములకు సావర్ణ్యము సయుక్తి కముగ సిద్ధించునను తలంపుతో వరరుచి "ఋౡ వర్ణయో స్సావర్ణ్యంవాచ్యం" అనువార్త్తికమును స్మరించినట్లూహింపను టకుఁ గూడ నవకాశముగలదు.

ఇది యటులుండ నీ ఋ ౡ వర్ణముల నొకకూటముగాఁ బఠించుటయందు వేఱొకవిశేషముగూడఁ గలదు. ఋ ౡ వర్ణ ములు స్వరములలోఁ బరిగణింపఁబడుచున్నను అ ఇ ఉ లవలె శుద్ధస్వరములుగాక హల్భాగమిశ్రితస్వరములై యున్నవి. దానంజేసికూడ నీరెండిటికి నొకకూటమునందు పొందికకు స్వారస్యము గలుగుచున్నది.

ఇఁక నీసూత్రమునందు 'క్' అనునది ప్రత్యాహారవర్ణ మగుచు నిత్సంజ్ఞగాఁ బరఁగు చున్నది. ప్రకృతమున రెండు సూత్రములచే నభిప్రేతములగు 'అ ఇ ఉ ఋ ౡ' అను వర్ణ ములచే మూలస్వరము లుచ్చరింపఁబడి స్వరవిశేషజ్ఞానమునకు సావకాశము గలుగఁజేయునను నాశయముతో స్వరములకంటె

విలక్షణమగు స్పర్శములయొక్క యుత్పత్తిని నందులకుఁదగు
స్పృష్టప్రయత్నమును స్ఫురింపఁజేయుటకు స్పర్శములలోనగ్ర
వర్ణమగు కకారము నిచట నుపదేశింపఁబడుచున్నది. "అఇఉణ్"
అను సూత్రముచే వర్ణోత్పత్తికిఁదగు కంఠము తాలువు
ఓష్ఠము మూర్ధమునను నాల్గుస్థానములును "ఋ ఌ క్" అను
సూత్రముచే దంతమనెడి స్థానమును గలిసి యైదుస్థానములు
నిచట ప్రదర్శింపఁబడుచున్నవి. "అ ఇ ఉ ఋ ఌ" అను స్వర
ములకు వివృతప్రయత్నము తెలియఁబడుచున్నది. స్పృష్ట
ప్రయత్నము వెలుపడు వర్ణములు కేవలము మూర్ధన్యములే
యగునా లేక స్పృష్టప్రయత్నముచే స్థానాంతరములందుఁ
గూడ వర్ణవిశేషములు గల్గునా యను శంకను వారించి స్పృష్ట
ప్రయత్నముచే స్థానాంతరములందుఁగూడ వర్ణములు బయలు
వెడలుననియు నవి వివృతప్రయత్నముచే వెలువడు వర్ణములకంటె
నత్యంతము విలక్షణములనియు నయ్యవి స్పర్శము లను వ్యవ
హారమును గనుచున్నవనియు సూచింప నీ 'ఋ ఌ క్' సూత్ర
మున 'క్' అను వర్ణ మిత్సంజ్ఞగా నుపదేశింపఁబడియున్నది.

ఇఁక నీ రెండుసూత్రములను బ్రత్యాహారము చేసినచో
'అక్' అను సంజ్ఞ గలుగుచున్నది. 'అక్' అను సంజ్ఞవలనఁ
దెలియవచ్చెడివిశేషవిషయ మేమనఁగాఁ గంఠస్థానమున వివృత
ప్రయత్నముచే స్వరమగు నకారమును స్పృష్టప్రయత్నముచే
స్పర్శమగుకకారమును జనించునట్లు స్థానాంతరములందుఁగూడ
వివృతప్రయత్నముచే స్వరములును, స్పృష్టప్రయత్నముచే
స్పర్శములునుజనించుచున్నవనికూడఁ బ్రదర్శింపఁబడుచున్నది.

ఇంతియకాదు. ఈ రెండుసూత్రములకుఁ బ్రత్యాహారవర్ణము
లగు 'ణ్ క్' అనునవి యకారవిహీనములై వ్యంజనమాత్ర
ముగాఁ బ్రదర్శింపఁబడుటచే 'హయవరట్' అను సూత్రము
మొదలుగాఁగల పదిసూత్రములందు నుచ్చరింపఁబడిన హల్ప్ర
త్యాహారఘటకవర్ణములన్నిటియందును వినవచ్చెడి యకార
ముచ్చారణార్థమేయనియు వర్ణములన్నియు నకారరహితములు
గానే భావింపవలయుననియు సూచింపఁబడుచున్నది. ఇంతియ
కాదు. హల్ప్రత్యాహారఘటకవర్ణములకు స్థానమును నిర్ణయిం
చుటలో నావర్ణములను నకారరహితములుగా నుచ్చరించి విమ
ర్శింపవలయునేగాని వేఱొండువిధమున విమర్శింపఁగూడదు.

ఇట్లు "ఋ ఌ క్" అను సూత్రమునందలి 'ఌ' వర్ణము
యొక్క గ్రహణముచే మహత్తరమగు ప్రయోజనము గల్గు
చుండ "ఌకారోపదేశో యదృచ్ఛాశక్తిజానుకరణప్లుత్యా
ద్యర్థ"యని ఌకారోపదేశము యదృచ్ఛాశబ్దప్రయోగార్థ
మనియు నశక్తివలనఁ గల్గినదాని యనుకరణార్థమనియుఁ
బ్లుత్యాద్యర్థమనియుఁ జెప్పుట సామాన్యము.

3. ఏ ఓ ఙ్.

ఏకారము ఓకార మను రెండును అకారాదులవలె
మూలస్వరములుగాక మూలస్వరములయొక్క సంధిచే నిష్ప
న్నములగుటంజేసి సంధివర్ణములని చెప్పఁబడుచున్నవి. అనఁగా
నకారమునకు నికారము పరమగునపు డేకారమును, అకార
మున కుకారము పరమగునపు డోకారమును నేకాదేశములుగా

వచ్చుచున్నవి. దానంజేసి యకారేకారములయొక్క సంధి వర్ణము 'ఏ' యనియు నకారోకారములయొక్క సంధివర్ణము 'ఓ' యనియు నిట్టిసంధిని గుణసంధియనియు గుణసంధియందు వినియోగమును బొందు వర్ణములు గుణసంజ్ఞకము లనియు వ్యవహారము జరుగుచున్నది. దానంజేసి గుణసంజ్ఞతో నొప్పు 'ఏ ఓ' లు రెండును బ్రత్యేకసూత్రమునందు నలరారు చున్నవి.

ఏ ఓ లు రెండును సంధివర్ణములుగాఁ దెలియవచ్చు చున్నను 'ఆ ఈ ఊ' వర్ణములవలెఁ బ్రత్యేకవర్ణముగా నుచ్చ రింపఁ బడుటచేతను సంధివర్ణములయొక్క స్ఫూర్తి యంతగా లేకపోవుటచేతను 'ఆ ఈ ఊ' ల వలె దీర్ఘాక్షరములుగానే వ్యవహరింపఁబడుచున్నవి. దీర్ఘాక్షరమన రెండుమాత్రలతో నొప్పుస్వరమని యర్థము. ఏ కా రౌ కారము లన్ననో రెండు స్వరములయొక్క సంధివర్ణములగుచు రెండేసి మాత్రలచే నొప్పుచుండుటంజేసి హ్రస్వభావము లేక, దీర్ఘములే యగు చున్నవి. 'ఏ ఓ' వర్ణములు సంధివర్ణము లగుటంజేసి యెల్ల ప్పుడును సాధారణముగా మాత్రాద్వయవిశిష్టములే యగు చున్నవి. కావున నీ 'ఏఓ' లెల్లప్పుడును దీర్ఘవర్ణములే యగుచు హ్రస్వభావము నెంతమాత్రము పొందఁజాలవు. కావున ఏ ఓ లకు హ్రస్వభావము సమంజసము కానేరదు. ఏఓ లకు హ్రస్వము వచ్చునప్పుడు 'ఇ ఉ' వర్ణములే వచ్చునను నర్థముగల "ఏచ ఇగ్ఘ్రస్వాదేశే" (పాణి 1-1-48) అను పాణినిసూత్ర ముచే నీ ఏ ఓ లకు హ్రస్వముగా 'ఇ ఉ' వర్ణములే

చెప్పఁబడినవి. కావున దీనిచే నీ‘ఏఓ’లకు హ్రస్వములుగాఁ దెనుఁగున వ్యవహరింపఁబడెడి ‘ఏఓ’ లెంతమాత్రము సంస్కృతమున లేవని స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నవి. అకృతము ననే ‘ఏఓ’లకు స్వభావసిద్ధములగు హ్రస్వములు కానప్పటికి నాసూత్రముచే శాస్త్రప్రక్రియా మాత్రప్రయోగమునకై యీ ‘ఇఉ’ వర్ణములు హ్రస్వములుగా నుపదేశింపఁబడినవి. కావున నీ‘ఏఓ’లకు హ్రస్వ మప్రసిద్ధమని సుస్పష్టము.

ప్రాచీన వర్ణ సమామ్నాయమున ‘ఏఐ, ఓఔ’ యను క్రమము దెలియవచ్చుచుండ ‘ఏఓ, ఐఔ’ అను నీరీతిగా నేకారానంతర మోకారమును గ్రహించి యైకారమును గ్రహింపక పోవుటకుఁ గల కారణము “అదేఙ్ గుణః” అను సూత్రముచే విధింపఁబడు గుణసంజ్ఞాసిద్ధియేయని స్పష్టమగుచున్నది. ఇంతియు గాక, సంధివర్ణత్వమునఁ గూడ నీరెండిటికిని జేగువయగుసంబంధము గలుగుటచేఁ గూడ వక్రతమమగు నైకారమును దీసికొనఁ బొందింపక యోకారమునే పఠించెను. ఈ ‘ఏఓ’లకు హ్రస్వభావము లేకపోవుటచే హ్రస్వములతో సంబంధించిన యోటు భావము లర్థలోపముచే నివృత్తిఁ జెంద దీర్ఘప్లుతములతో సంబంధించినవండ్రెండు భావములే కలుగుచుండును. దానంజేసి యీ సూత్రమునందలి ‘ఏ’ యనునది వండ్రెండేకారములకును, ఓ యనునది వండ్రెండోకారములకును గ్రాహక మగుచున్నదని గ్రహింపవలయును.

ఇఁక నేకారము సంధివర్ణమై యకారేకారములతో నొప్పియుండుటఁజేసి యేకారమునకు నికారాదుల ట్లేకస్థాన

ముత్పత్తికిఁ గారణముగాక యుత్పత్తియందు స్థానద్వయ సంబంధముండుటంజేసి స్థానద్వయ ముత్పత్తిస్థానముగా నేకా రమునకుఁ దలంపఁబడుచున్నది. దానంజేసి యేకారమునకు నకారేకారముల కుత్పత్తిస్థానములగు కంఠతాలువులయొక్క సమాహారము కారణమగుచున్నది. కావునఁ గంఠతాలువు లుత్పత్తిస్థానముగఁ దలంపఁబడుచున్నవి. ప్రయత్నమన్ననో వివృతప్రయత్నమే.

ఏకారమునకుఁ గంఠతాలుసమాహార ముత్పత్తిస్థాన మట్లే యట్లే కంఠోష్ఠములయొక్క సమాహార మోకారమున కుత్పత్తిస్థానమని తెలియునది.

ఇఁక నీ సూత్రమున 'ఙ' కార మిత్సంజ్ఞావర్ణముగా నుపదేశింపఁబడుచున్నది. పూర్వ సూత్రమునఁ గంఠమునందు స్పృష్టప్రయత్నముచే వెలువడు 'క' కార మిత్సంజ్ఞకముగా గ్రహింపఁబడియె. అద్దానివలనఁ గంఠమునందు స్పృష్టప్రయత్నముచే వెలువడు 'క ఖ గ ఘ ఙ' లలో 'ఙ' కారము కేవలకంఠముతోడనే సంబంధింపక నాసికతోఁగూడ సంబంధించుటచే వైలక్షణ్యము నొందియున్నది. కావున నట్టి విలక్షణ వర్ణములు ప్రతిస్థానమునందుఁ గూడ నాసికాసంబంధముచే వెలువడుట కవకాశము గలదని సూచించుటకును గంఠము నందు స్పృష్టప్రయత్నముచే వెలువడువర్ణములన్ననో కకా రము మొదలు ఙ కారమువఱకుఁదెలియవచ్చెడి యైదుస్పర్శలే యని తెలుపుటకును గ్రహింపఁబడుచున్నది.

4. ఐ ఔ చ్.

'ఐ ఔ చ్' అనుసూత్రమునందు 'ఐ ఔ' అను రెండు స్వరములును వినవచ్చుచున్నవి. ఈరెండును 'ఏ ఓ'లట్లు సంధ్యక్షరములే. ఈ యక్షరములందు సంధిభావము ఏ ఓ లకంటె స్ఫుటతరము. 'అ + ఇ' లయొక్క శ్రవణమైకారమునందు స్పష్టతరముగా నుండుటచేతను నట్లే 'అ+ఉ' ల యొక్క శ్రవణ మౌకారమునందు స్పష్టతరముగా నుండుటచేతను నీయవి ఏ ఓ లకంటె విలక్షణమగుసంధ్యక్షరములని సుస్పష్టమగుచున్నది. ఇంతియకాక వృద్ధియనువిశేషసంజ్ఞతో నేర్పాటుచేఁ గూడ నీయవి ప్రత్యేకసూత్రముగా నుపదేశింపఁబడియున్నవి. ఈయవి సంధ్యక్షరములే యగుటంజేసి పైనిఏఓలకుఁ జెప్పంబడిన విశేషము లన్నియు నిచటఁ బ్రాయికముగా నతిదేశింపఁజేయు నగును. ఎట్లన అకారైకార (ఏ) ము లైకారమునకు నకారౌకార (ఓ) ము లౌకారమునకును సంధివర్ణములు ప్రాయికముగా నగుటఁజేసి యీ యైయౌకారములు సంధివర్ణములే యగుచున్నవి. ఐకారమునందు స్ఫుటతరముగా నకారేకారములు వినఁబడుటఁజేసి యియ్యది కంఠతాలువులు స్థానముగాఁగలదని స్పష్టమగుచున్నది. అట్లే ఔకారమునందుఁగూడ నకారోకారములు వినఁబడుటచే నియ్యది కంఠోష్ఠములు స్థానముగాఁ గలదనియు స్పష్టమగుచున్నది. పైవర్ణమువలెనే ఇదిగూడ వివృతప్రయత్నమే యగుచున్నది. ఇట్లే ఐకారౌకార (ఔ) ములు రెండును దీర్ఘములేయగుచుహ్రస్వత్వమును గలిగియుండకపోవుటచే నీయవి పండ్రెండుపండ్రెండు భేదముల నందుచున్నవి.

ఈ సూత్రమునందలి యిత్సంజ్ఞావర్ణము 'చ్' అనునది, పూర్వసూత్రములగు 'ఋ ఌ క్' 'ఏ ఓ ఙ్' అనువానియందలి 'క్ ఙ్' లచేఁ గంఠమునందు స్పృష్టప్రయత్నముచే వెలువడు 'క ఖ గ ఘ' యను స్పర్శవర్ణములను సూచించి క్రమప్రాప్తములగు తాలుస్థానమునందు స్పృష్టప్రయత్నముచే వెలువడు 'చ ఛ జ ఝ ఞ' లను స్పర్శములను సూచింప వర్గప్రథమాక్షరమగు చకార మిచట నిత్సంజ్ఞగా సూత్రింపఁబడినది. ఇంతియగాదు; లోకమున, "అ ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ" వర్ణములకు నచ్చు లను ప్రసిద్ధి గూడఁ గలదు. అట్టి ప్రసిద్ధిని సంగ్రహించుటకుఁగూడ నిచటఁ జకారమిత్సంజ్ఞగా గ్రహింపఁబడినదని తెలియవలెయును. ఏమన 'అచ్' అను ప్రత్యాహారముచే నభిప్రేతములగునవియే యచ్చు లని స్వరములకు నామాంతరప్రసిద్ధిగూడ నున్యక్తమగుచున్నది. ఇంతవఱకు స్వరములనఁగా నచ్చులే ప్రధానముగాఁ గల్గిన నాల్గు మాహేశ్వరసూత్రములయొక్క క్రమవిశేషమును గూర్చి యనులోమముగా విమర్శింపఁబడినది.

ఇఁక నీ నాల్గుసూత్రములయొక్క ప్రతిలోమక్రమముచే నొక యద్భుతమగు విశేషము ప్రదర్శింపఁబడియున్నట్లు పాణినిమహాశయునిచేఁ బఠింపఁబడిన సూత్రసందర్భమువలనఁ దెలియవచ్చుచున్నది. పాణినిమహాశయుని గ్రంథమునఁ దొలియధ్యాయమందలి తొలిపాదమున మూఁడు సూత్రము లీదిగువక్రమమున వెలయుచున్నవి.

"వృద్ధిరాదైచ్" "అదేఙ్ గుణః" "ఇకోగుణవృద్ధీ" అని. ఇందు మొదటిసూత్రమగు 'వృద్ధిరాదైచ్.' అనునది 'ఐఔచ్' అను నాలుగవసూత్రమును నాధారముగఁ జేసికొని స్మరింపఁ బడినట్లు సుస్పష్టము. రెండవసూత్రమగు 'అదేఙ్ గుణః' అనునది 'ఏ ఓ ఙ్' అనుమూఁడవసూత్రము నాధారముగాఁ జేసికొని స్మరింపఁబడినట్లు సుస్పష్టము. మూఁడవసూత్రమగు "ఇకోగుణ వృద్ధీ" అనునది "(అ) ఇ ఉ ణ్ ఋ ఌ క్" అను రెండుసూత్రముల నాధారముగాఁ జేసికొని స్మరింపఁబడినట్లు సుస్పష్టము. కాని యిందలి తొలిసూత్రమందలి యకారమును విడిచి గ్రహించిరనునది యొక విశేషము. మహేశ్వరసూత్రములు నాల్గుసూత్రములుగాఁ బరఁగుచున్నను నానాల్గవసూత్రమం దలి యకారమును వేఱుచేసి మొదటి రెండు సూత్రముల నొక కూటముగ భావనచేసి పాణిని తన మొదటి మూఁడుసూత్ర ములను స్మరించినట్లు సువిదితమగుచున్నది. ఇచట వేఱుచేయఁ బడిన యకారమును పాణినిమహాశయుఁ డెచట స్మరించు చున్నాఁడనివిచారించినచోఁ దనగ్రంథాష్టమునననఁగా నెనిమి దవ యధ్యాయమందలి నాల్గవ పాదముయొక్క యాఱునది యెనిమిదవ సూత్రమున "అ అ" అని స్మరించియున్నాఁడని సువిదితమగుచున్నది.

ఇట్లు ప్రతిలోమక్రమమున మహేశ్వరసూత్రములను గ్రహించి సూత్రరచన నారంభించుటయందును, ననులోమ క్రమమునఁ దనసూత్రములను బ్రారంభించుటయందును నీమొదటినాల్గు మహేశ్వరసూత్రములు సుహత్తర మగు

సతిశయమును నితరములగు పది సూత్రములకంటెఁ గల్గి
యున్నట్లూహింపవచ్చును! ఇచట నభిప్రేతమగు విశేషము
దిఙ్మాత్రముగ నిరూపింపఁబడుచున్నది.

మొదటి సూత్రము 'వృద్ధిరాదైచ్' అని స్మరింపఁబడు
చున్నది. దీనియర్థమేమన, దీర్ఘాకారము ఐ ఔ వర్ణములును
వృద్ధియను నొక సంజ్ఞను గల్గియున్నవని. వృద్ధియనునది సంజ్ఞా
వాచకముగా వ్యాకరణమున వ్యవహరింపబడుచున్నను సర్వవిశే
షముచే బ్రహ్మవాచకముగా నతిశయమును గనుచున్నది.
"బృహి-వృద్ధౌ" అను స్మరణముచే బృహిధాత్వర్థము వృద్ధి
యని తెలియుచున్నది. బృహి ధాతువునకు "సర్వధాతుభ్యో
మనిన్, బృంహేర్నోఽచ్చ" అను సర్వాదికసూత్రములచే మని
న్ప్రత్యయమును, అకారమును బొందక చేయుటచే బ్రహ్మశబ్దము
నిష్పన్నమగుచున్నది. దానంజేసి బ్రహ్మయన వృద్ధియను
నర్థము సుస్పష్టముగదా! అనఁగా బ్రహ్మవృద్ధిశబ్దము లేకార్థ
కములే. దానంజేసి బ్రహ్మవిదుఁడగు పాణిని తనగ్రంథమునకు
మంగళసిద్ధికై యుత్కృష్టధనమును స్మరించుటయే గాక యాకా
రైకారౌకారములకు వృద్ధియను సంజ్ఞ చేయుటచే నయ్యవి
బ్రహ్మయనుసంజ్ఞను గూడ నొప్పుచున్నవని ప్రదర్శించి
నట్లయగును. ఆకారైకారౌకారములు బ్రహ్మమునకు
వాచకములేయని రహస్యసంకేతము. ఇట్టి రహస్యసంకేతము
గూడ నీ మాహేశ్వరసూత్రములందు నభిప్రేతమై యున్న
టుల స్ఫురింపఁజేయునట్లు తన సూత్రమును పాణిని స్మరించి
యున్నాఁడని చెప్పుట సూత్రాతిశయహేతువే యగుచున్నది.

ఇఁక "అదేఙ్ గుణః" అనునది రెండవసూత్రము. దీనిచే హ్రస్వాకారమునకును 'ఏఓ'లకును గుణమన్నసంజ్ఞ విధింపఁబడుచున్నది. గుణశబ్దమిచట సంజ్ఞావాచకముగా నలరారుచున్నను గుణశబ్దముచే నుపలక్షితమగునట్టియు గుణసామ్యావస్థారూపమగు నవిద్య యభిప్రేతమగుచు వృద్ధియగు బ్రహ్మముకంటెను విలక్షణమగుటంజేసి బ్రహ్మముకంటె నత్యంత విలక్షణమను స్ఫూర్తిని కలుగఁజేయుచున్నది. దానంజేసియే బ్రహ్మబోధకములగు 'ఐఔ'లకును నవిద్యాబోధకములగు ఏఓలకును భిన్న సూత్రకల్పనమని కూడ హేత్వంతరమును జెప్పవచ్చును. ఇఁక 'ఇ, ఉ, ఋ, ఌ' వర్ణములన్నియు యకారమునందుఁ దెలియవచ్చెడి స్వరభావముకంటె విలక్షణమగు వ్యంజనభావముతో నొప్పి యుండుటంజేసి 'ఇక్' అను ప్రత్యాహారముచే స్మరింపఁబడినట్లును నకారమునుండి వేఱుచేయఁబడినట్లు నూహింపవచ్చును. ఇక్కులయందుఁ దెలియవచ్చెడి ద్వైధీభావమును సూచించుటకై 'ఇకోగుణవృద్ధీ' యను పరిభాషాసూత్రము స్మరింపఁ బడినట్లూహింపవచ్చును. అవిద్యచే బ్రహ్మ మాచ్ఛాదితమగుటంజేసి యవిద్యయే యనఁగా గుణభావమే దలియవచ్చుచు బ్రహ్మభావము తిరోహితమైనట్లు తోఁచుచున్నదను నాశయమును సూచించుటకై "గుణవృద్ధీ" యను పదమందు గుణశబ్దమును దొలుత స్మరించెనని చెప్పిన యుక్తిసహముగ నుండు ననుటకు సందేహము లేదుగదా!

ఇట్లు పరమపవిత్రమగు వైదికసిద్ధాంతమును స్ఫురింపఁజేయు గొప్ప యాశయముతో నీ మూఁడు సూత్రములు

స్మరింపఁబడుటంజేసి యీ మూఁడుసూత్రములును బాణి
నీయ గ్రంథమునకు మకుటముగ నలరారుచున్నవి. ఇఁక
గ్రంథాన్తిమసూత్ర మగు "అ అ" అను సూత్రముచే
గ్రంథాన్తమందలి మంగళమునందుఁగూడ నిష్టదేవతాస్మరణ
మును జేసినట్లు "అకారః సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమేశ్వరః"
అను స్మృతిచే విదితమగుచున్నది. ఇట్టి యతిశయముతో
నీమూఁడుసూత్రములు నొప్పుచున్నవను నాశయముతోడనే
భాష్యకారుఁడగు పతంజలి గూడఁ దన భాష్యమందలి తృతీ
యాహ్నికమున నీమూఁడుసూత్రములనే విమర్శించియుండెనని
కూడఁ జెప్పనొప్పు. కావునఁ బాణినీయమున నీమూఁడు
సూత్రములకు నెట్టియతిశయము దెలియనగునో మాహేశ్వర
సూత్రములందలి తొలినాల్గుసూత్రములందుఁ గూడ నట్టి
యతిశయమునే గననగును. గ్రంథవిస్తరభీతిచే విశేషవిషయము
లుపరమింపఁబడి ప్రకృత మనుసరింపఁబడుచున్నది.

ఇందు గమనింపఁబడిన విషయము మాత్ర మియ్యది:
మాహేశ్వరసూత్రముల నాల్గింటిని విలోమక్రమమున
స్వీకరించి పాణినిమహాశయుఁడు తన గ్రంథమందలి మొదటి
మూఁడుసూత్రములగు, "వృద్ధిరాదైచ్, అదేఙ్ గుణః, ఇకో
గుణవృద్ధీ" అను వానిని, అంతిమసూత్రమగు "అ అ" అను
దానిని స్మరించుటచేఁ దనగ్రంథమునను నీ నాల్గుసూత్రములే
ప్రధానమని భావించిన ట్లూహింపవచ్చును. అట్టి యతిశయ
ముత్తరసూత్రముచేఁ బ్రదర్శింపఁబడుచున్నది.

5. హ య వ ర ట్ - ల ణ్.

మాహేశ్వరసూత్రములలో మొదటి నాల్గింటిచేతను స్వరములయొక్క క్రమము స్వోచితోత్పత్తిస్థానక్రమమున కనుగుణముగ వ్యవస్థచేయఁబడి యున్నటులఁ బ్రదర్శింపఁబడెను. ఇట్టిక్రమము ప్రాచీనాక్షర సమామ్నాయమునందలి క్రమముతో ననుగుణముగనే యున్నటుల "అ ఇ ఉ ణ్, ఋ ఌ క్" అను సూత్రములచే సుస్పష్టముగఁ దెలియవచ్చుచున్నది.

ఇఁక వ్యంజనములు మిగిలిన పదిసూత్రములచేఁ బ్రదర్శింపఁబడుచున్నవి. మాహేశ్వరసూత్రములందుఁ బ్రదర్శింపఁబడిన వ్యంజనములక్రమము ప్రాచీన వ్యంజనముల క్రమము కంటె నత్యంతము విలక్షణముగా నున్నటుల సుస్పష్టము. ఇట్టి వైలక్షణ్యమునకుఁగల కారణ మీ వ్యంజనములందుఁ గూడ స్వరములయొక్క స్థానక్రమము ననుసరించి క్రమము నేర్పరచుటయే పరమాశయముగాఁ గల్గియుండుటయేయని తెలియ వచ్చుచున్నది. వ్యంజనములు స్పర్శములనియు నంతస్థము లనియు నూష్మములనియు ముత్తెఱఁగులఁబరఁగుచున్నవి. ఇందు స్పర్శములైదువర్గములుగ స్థానక్రమము ననుసరించి విభజింపఁబడి యున్నవి. అంతస్థములు నూష్మములును నెనిమిదివర్ణములుగా నలరారుచు స్వరములట్లు వేఱువేఱుస్థానములం దుత్పన్నము లగుచున్నవి. ఇంతియకాదు. ప్రాచీనసమామ్నాయమున వీనియొక్క క్రమమునకు నుపపత్తిని గల్పించుటకు నిష్ఫలమగు నవకాశము చిక్కదు. ఏలయన ప్రాచీనసమామ్నాయ

మునఁ దీవర్ణము లిట్లెట్లెఱుఁగునఁ బఱఁగుచున్నవి. 'య ర ల వ శ ష స హా' యని.

ఇందు యకారమున కుత్పత్తిస్థానము తాలువు. రేఫమునకు ఋకారమట్లు మూర్ధము స్థానముగా నభిప్రేతమై యున్నది. లకారమునకు దంతము స్థానము. వకారమునకు నోష్ఠము ప్రధానమగుస్థానము. శవర్ణమునకుఁ దాలువేస్థానము. అట్లే షకారమునకు మూర్ధము స్థానముగా నభిప్రేతమైనది. సకారము దంతమే స్థానముగాఁ గలది. హాకారము కంఠ్యము. ఈక్రమము పైనిఁ దెలియవచ్చెడి యచ్చుల క్రమమునకు భిన్నము. ఇది యటులుండ నిందుఁదెలియవచ్చెడి "య ర లవ" లకు 'ఇ ఉ ఋ ఌ' వర్ణములతోఁ బ్రకృతియందు నియతమగు సంబంధ మొకటి తెలియవచ్చుచున్నది. ఇ ఉ ఋ ఌ వర్ణములకును, య ర ల వ లకును బ్రకృతియందలి సంబంధముచేఁగాని స్థానసంబంధముచేఁగాని క్రమము భేదించుచుండును. అట్టి సంబంధముచేఁ గ్రమము నభిలషించినచో 'య వ ర ల' అను క్రమము సమంజసముగానుండును. ఇఁక నకారమునకు స్థానసంబంధముగలవర్ణ మీ వర్ణములలో హాకారము తక్క వేఱొండువర్ణము తెలియరాదు. దానంజేసి "అ ఇ ఉ ఋ ఌ" అను స్వరములతో ననుగుణమగు స్థానక్రమము ననుసరించుటకై "హ య వ ర ట్, లణ్" అను రెండు సూత్రములు పఱఁగుచున్నవి. అచ్చులలో "అ ఇ ఉ ఋ ఌ" అను వర్ణములకు రెండుసూత్రము లెట్లుపదేశింపఁబడెనో యాతీరుననే హాయవరలకుఁగూడ రెండు సూత్రములే యుపదేశింపఁబడెను.

కాని యొకింతవిశేష మిందుఁ గలదు. ఏమన 'అ ఇ ఉ ణ్' సూత్రమందలి 'అ ఇ ఉ' వర్ణములకును 'ఋ ఌ క్' సూత్రము నందలి ఋ ఌ వర్ణములకును సంబంధించిన హయవర లేక సూత్రముగా "హయవరట్" అనియు 'ఌ' కారమునకు సంబంధించిన లకారము వేఱొక సూత్రముగ 'లణ్' అనియు నుపదేశింపఁబడెను.

ఇట్టివిభాగమునందలి విశేష మొకింత విచారణీయంబు. ఏమన, భాషయందు ఌకారమునకుఁ బ్రసిద్ధి లేదు. కావున ఌకారము నుపదేశించుట యవసరముగాఁ దోఁచదు. కాని యుపదేశింపఁబడెను. అట్టియుపదేశమునకుఁ బ్రయోజన మేమగు నను విచికిత్స వార్తికకారుఁడగు వరరుచికాలమునుండియు బయలువెడలినట్లు సుస్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. భాషయందు ఌకారమునకుఁ బ్రయోజనము లేకున్నను బ్రయోజనమును గనుచున్న 'అఇఉఋ' అనుస్వరములకు ననుగుణమగు 'హయవర'ల తోపాటు సుప్రసిద్ధమగు లకార మొకటి భాషయందు విపులప్రచారమును గనియున్నది. అచ్చుల కనుగుణముగ హల్లులు జనించుట వర్ణోత్పత్తిక్రమమును జూచిన సువ్యక్తమగుచున్నది. అట్టిస్థితియందు దంత్యముగాఁ దెలియఁబడు 'లతథదధన'లకు మూలమగు స్వర మెద్దియైన గలదా యను నాశంక కవకాశము కలుగుచున్నది. అట్టి యాశంకానివృత్తికి లకారముతో సమానస్థానము గల్గిన స్వరమగు ఌకారముపదేశింపఁబడెననియు నట్టి ఌకారమునకు సహజసిద్ధమగు లకారమువంటిప్రయోజనము లేదనిసూచించుటకు ఌకారమునకు

'ఋ ౡ క్' సూత్రమునందుఁ బొందికయు, ఌకారముకంటె విలక్షణమగు సహజస్వప్రచారముగల్గిన ల కారమునకు 'ల ణ్' అను సూత్రముసఁ బృథగుపదేశమును జేయఁబడెనని నిశ్చయింపనొప్పు. కావున "హ య వ ర ట్, లణ్" అని రెండు సూత్రములయొక్క ప్రవృత్తికి నియ్యదియే కారణమని తెల్పియ వచ్చుచున్నది.

ఇఁక 'హ య వ ర ట్' అను సూత్రమునందలి యిత్సంజ్ఞావర్ణమగు 'ట' కారముచేఁ బ్రాచీనవర్ణసమామ్నాయమునఁ గవర్గచవర్గములవిమ్మటఁ దెలియవచ్చెడి ట వర్గము సూచింపఁబడుచున్నది. మహేశ్వరసూత్రములందు వ్యంజనములయొక్క క్రమమునకుఁ బ్రాచీనవర్ణసమామ్నాయముతో సత్యంత వైలక్షణ్యము గన్పట్టుచున్నది. ప్రాచీనవర్ణసమామ్నాయముగూడ మహత్తరమగు ప్రయోజనముతో నలరారుచున్నదనియు నట్టిక్రమ మించుకేనియుఁ బరాకుఁ జెందబడఁగూడదనియుఁ దలఁచి యట్టి గొప్పయాశయముతో నీ మహేశ్వరసూత్రములందలి ప్రత్యాహారవర్ణములలో 'క్, చ్, ట్' లయొక్క క్రమ మాశ్రయింపఁబడెనని గ్రహించునది.

'లణ్' సూత్రమునందు అకారణకారములు రెండిత్సంజ్ఞలుగా వినఁబడుచున్నవి: దానంజేసి 'లణ్' సూత్రముచే నభిప్రేతమగు వర్ణము హల్మాత్రము, ఇందుఁదెలియవచ్చెడి యకారముతో పాటు పూర్వసూత్రమందు వినవచ్చెడి యకారాదులయందు నుత్తరసూత్రములందు వినవచ్చెడి 'ఞ' కారాదులయందును గూడ నకార ముపదేశింపఁ బడియే యున్నది.

ఇదివఱకు 'అణ్ అచ్' అక్' అను ప్రత్యాహారములందు సూత్రములం దుపదేశింపఁబడినవిధముననే యకారాదిస్వరము లించుకేనియు వ్యత్యాసము లేక గ్రహింపఁబడుచున్నవి. దానంజేసి ప్రత్యాహారమునందుఁ దెలియవచ్చెడి హాకారాది వర్ణములు గూడ నుపదేశించిన విధముననే గ్రహింపఁబడ వలయుననునాశంక గల్గును. అట్టి యాశంకను బోఁగొట్టి హకా రాదులయందలియకార ముచ్చారణార్థమని గ్రహింపఁజేయు టయు, 'రల' లను మాత్రము సూచించు ర ప్రత్యాహార మును విధించుటయును ప్రయోజనముగాఁ గల్గి 'హయవరట్' సూత్రమునకును, "ఇమజణనమ్" ఆదిగాఁ గల సూత్రము లకును మధ్యను గాకాక్షిన్యాయముచే 'లణ్' సూత్రమందలి యకారమునకు నిత్సంజ్ఞ విధింపఁబడియె. ఇత్సంజ్ఞావర్ణమున వ్యవహారసిద్ధికై యుచ్చరింపఁబడి ప్రయోగములందు శూన్యప్ర మాణముగాని వర్ణమని యభిప్రాయము.

'లణ్' సూత్రమునందు నొకే హల్లుపదేశింపఁబడి యందలియకారమునకే యిత్సంజ్ఞారూపమగు ప్రయోజన మున్నదని చెప్పుటచే నితరసూత్రములందలి హల్లులపై నుండెడి యకారముల కుచ్చారణమాత్రమే ప్రయోజనము సిద్ధించుచు వేఱొండు ప్రయోజనము లేదని సిద్ధించుచున్నది. 'లణ్' సూత్రమందలి ణ కారరూపేత్సంజ్ఞా వర్ణమున్ననో టవర్గముయొక్క యంతిమాక్షరమును బ్రాచీనవర్ణసమామ్నా యానుగుణముగ సూచించుటయే ప్రయోజనముగాఁ గల దియై యొప్పుచున్నది.

7. ఞ మ ఙ ణ నమ్.

"హాయవరట్, లణ్" అను సూత్రములచే 'అ ఇ ఉ ణ్, ఋ ఌ క్' అను సూత్రములచే నుపదేశింపఁబడిన స్వరములతో సంబంధముగల్గిన 'హ య వ ర ల" అను వ్యంజనములు రెండుసూత్రములలో నుపదేశింపఁబడినవి.

ఇఁక 'ఏ ఓ ఐ ఔ' లతో సంబంధించిన వ్యంజనములు లేమింజేసి యవ్వాని కనుగుణములగు సూత్రములు విధించుటకుఁ దగుసావకాశము లేకపోయినను 'ఏ ఓ ఐ ఔ' లయందుఁ దెలియవచ్చెడి విశేషమువంటి విశేషముతో నొప్పు హల్లులు వినఁబడుచున్నవి. అట్టి విశేషమేమన - స్థానద్వయసంబంధము. అట్టిస్థానద్వయసంబంధము గల్గిన హల్లులన్నవో వర్గములం దుదవసుగ్ణములగు "ఙ ఞ ణ న మ" లు. ఈవర్ణములకు వేఱువేఱుత్పత్తిస్థానములు దెలియవచ్చుచున్నను బ్రతివర్ణమును నాసికతో సంబంధించియుండుటంజేసి బ్రతివర్ణమును స్థానద్వయమాలవాలముగాఁ గల్గియున్నట్లు దలంపఁబడుచున్నది. ఈవర్ణములకు నాసికతోడి సం బం ధ ము స్వ ర ము ల కుఁ దెలియవచ్చెడి- " ముఖనాసికా వ చ నో ౽ ను నా సి క ః" (పా. 1 1-8) అను సూత్రముచే విధింపఁబడినయనునాసికస్వరముతోడిసంబంధమా లేక యంతకంటెవిలక్షణమగుసంబంధమా యనునది గమనింపవలసినవిషయము. పరికించిచూడనీసంబంధము స్వరసంబంధముకంటె విలక్షణముగఁ దెలియవచ్చుటచే స్థానసంబంధముగాఁ దలంపఁబడుటంజేసి ఙ కారాదులకు స్థానద్వయసంబంధము దలంపఁబడుచున్నది. కావున స్థానద్వయ

సంబంధముగల యచ్చులసంబంధము ననుసరించి యీ హల్లుల యొక్క క్రమమును గ్రహించుటంజేసి 'ఙకారాదు లిచట నుపదేశింపఁబడుచున్నవి. అట్లుపదేశించుటలో స్థానక్రమము ననుసరించి యుపదేశింపఁబడినచో 'ఙ ఞ మ ణ' యను క్రమమున నుపదేశింపవలయును. అట్లుపదేశించినచోఁ గేవల ముప దేశమాత్రమే యగుచుఁ బ్రయోజనాంతర మలవడుట కవ కాశములేదు. 'అ ఇ ఉ ఋ' లకు సరియగు క్రమమున 'హ య వ ర' లను గ్రహించినటుల నీ యనునాసికవర్ణము లను గ్రహింపక కంఠస్థానికమునగు ఙకారము 'ఞ మ' లకు ననంతరమున నుపదేశింపఁబడియె. ఇద్దానికిఁ గారణమేమన- "ఞమో హ్రస్వాదచి ఙముణ్ణిత్యమ్" (పా. 8-3-32) అను సూత్రమున ఙముట్ప్రత్యాహారమున నీ 'ఞ మ' కారములు గ్రహింపఁబడక ఙ కార మాదిగాఁగల వర్ణములు అనఁగా 'ఙ ణ న'లు మాత్రమే గ్రహింపఁబడుటకొఱకని గ్రహించునది. కాఁగా నీమార్పు 'ఙమ్' ప్రత్యాహారసిద్ధికై పరఁగుచుఁ బ్రక్రియ కత్యంతోపకార మగుచున్నదని భావము. ఇంతియ కాదు. ఇంకను వేఱొకవిశేష మిందుఁ గలదు. ప్రాచీనాక్షర సమామ్నాయమునందు . స్వరములలో నౌకారమునకుఁ బిమ్మట ననుస్వారమనుపేరఁ బరఁగునది యొకటి స్వరముగ భావింపఁబడుచుఁ దెలియవచ్చుచున్నది. ఆ యనుస్వార మీ మాహేశ్వరసూత్రముం దెచటను గూడ నుపదేశింపఁబడలేదు. దానంజేసి యీ యనుస్వార మెందులకు నుపదేశింపఁబడ లేదను నాశంకగలుగ నా యనుస్వార మనునదియే యీ ఘుము

వర్ణములుగఁ బరిణమించుటంజేసి యనుస్వారప్రయోజన
మీ ద్వైదువర్ణములచే సిద్ధించుచున్నది. కావునఁ బ్రత్యేక
ముగా ననుస్వారమును గ్రహింప నవసరములేదని యనుస్వార
ముపేక్షింపఁబడి యద్దానిస్థానమున నీద్వైదువర్ణములు నుపదే
శింపఁబడిననను నూహా కవకాశము గల్గుచున్నది. దానంజేసి
స్వరములందలి సంఖ్యాలాఘవము గూడ నభిప్రేత మగు
చున్నది.

అనుస్వారకార్య మీ ద్వైదువర్ణములచే సిద్ధించుటం
జేసి యనుస్వారము పేక్షింపఁబడినదో యట్లే విసర్గకార్యము
హాకారముచే సిద్ధించుటంజేసి విసర్గము గూడ నీ మాహేశ్వర
సూత్రములందు పేక్షింపఁబడియె. స్వరముగాఁ దలంపఁబడెడి
విసర్గముయొక్క ఫలము హాకారముచే గతార్థమగుటచేతనే
యచ్చులకు వెనువెంటనే హాకార ముపదేశింపఁబడియె నని
కూడ గ్రహింపనొప్పును. ఈ సూత్రమునందు 'మ్' అను
వర్ణ మిత్సంజ్ఞకముగా గ్రహింపఁబడుచున్నది. ఈ 'మ్' అను
వర్ణ మితరసూత్రములందలి యిత్సంజ్ఞావర్ణములకంటె వైజా
త్యముతో నొప్పియున్నది. ఇతరసూత్రములందలి యిత్సం
జ్ఞావర్ణములు సూత్రములం దుపదేశింపఁబడిన వర్ణములకంటె
భిన్నముగా నలరారుచున్నవి. మకారమన్ననో యీసూత్రమం
దుపదేశింపఁబడిన మకారమే యగుచున్నది. ఇట్లుపదేశించుట
యందువిశేషప్రయోజనముండితీరవలయును. అదెద్దియన ఇంతకు
ముందుసూత్రమున ణకార మిత్సంజ్ఞగా నుపదేశింపఁబడియె
ననియు నద్దానిచేఁ బ్రాచీనాక్షరసమామ్నాయమునం దుప

దేశింపఁబడిన కకారాదిణకారాంతములగు స్పర్శములయొక్క క్రమవిశేషముగూడ స్మరింపఁబడినదనియు నిర్వచింపఁబడియె. ఇఁక నిచటి యిత్సంజ్ఞకమకారముచే స్పర్శములయందలి ణకారమునకుఁ బిమ్మటఁ బ్రాచీనాక్షరసమామ్నాయమం దుపదేశింపఁబడిన "తథ దధన, పఫ బభ మ" యను మకారాంతములగుస్పర్శములయొక్క స్ఫూర్తిని గలుగఁజేయుటయే పరమతాత్పర్యమని నిశ్చయింపనగును.

## సూత్రసప్తకవిశేషము.

ఇంతవరకు "అఇఉణ్, ఋఌక్, ఏఓఙ్, ఐఔచ్, హయవరట్, లణ్, ఞమఙణనమ్" అను సూత్రసప్తకముయొక్క ప్రయోజనవిశేషములు గొంతవఱకు నిరూపింపఁబడియె. ఇఁక నీసూత్రసప్తకముచేఁ దెలియవచ్చెడి విశేషము వివరింపఁబడుచున్నది. ఏమన - ఈయేడుసూత్రములచే మాహేశ్వరసూత్రములందలి మిగిలిన సగముసూత్రములుగూడ గతార్థము లగుచున్నవి. ఈసగము సూత్రములచే గతార్థమగు విశేషమేమన నక్షరసమామ్నాయమునందు భాషతోఁ బ్రయోజనము గల్గిన స్వరములును స్వరములతో సంబంధముకల్గిన వ్యంజనములును బుష్కలముగ నుపదేశింపఁబడినవి. అవెవ్వియన—

"అ ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ హ య వ ర ల ఞ మ ఙ ణ న" యను పందొమ్మిది వర్ణములు. ఈ వర్ణములచేఁ బ్రాచీనాక్షర సమామ్నాయమందలి యకారాద్యౌకారాంతములగు పదునాల్గుస్వరములను "ఙ ఞ ణ న మ య ర ల వ

హ ళ” యను పదునొకండు వ్యంజనములు బిందు విసర్గములు రెండును మొత్త మిరువదియేడు వర్ణము లుపదేశింపఁబడినవే యగుచున్నవి. మిగిలిన వర్ణములగు “ కఖగఘ, చఛజఝ, టఠడఢ, తథదధ, పఫబభ శషస ” యను ఇరువదిమూఁడు వర్ణము లుత్తరసూత్రసప్తకములచే నుపదేశింపఁబడుచున్నవి.

ఇందొకయపూర్వమగు విశేషముమాత్రము గలదు. ఏమన - ప్రాచీనాక్షరసమామ్నాయమున బిందువిసర్గములు రెండును స్వరములతోపాటు స్వరములవలెనే యుపదేశింపఁబడినవి. మహేశ్వరసూత్రములందన్నననో యయ్యవి యుపేక్షింపఁబడి తత్స్థానమున, “ఙ మ ఞ ణ న” లును హకారమును నుపదేశింపఁబడుటచే బిందువిసర్గములు రెండును వ్యంజనములే యని భావింపఁబడినట్లు నిశ్చయింపనగును. ఇంతియకాదు. ఈ బిందువిసర్గములు రెండు నెల్లప్పుడు నచ్చులకంటెనే పరములుగా వ్యవహరింపఁబడుచున్నవి. అచ్చులకంటెఁ బరముగా వ్యవహరింపఁబడు వర్ణములు హల్లులేగాని యచ్చు లెంతమాత్రము గాఁజాలవుగదా! ఒకానొకచోనట్లుచ్చరింపఁబడినను నా యచ్చులు శ్రూయమాణములుగాక సంధిచే నపహృతములే యగుచున్నవి. కావున నచ్చులకంటె నియ్యవి పరములుగా వ్యవహరింపఁబడుటంజేసికూడ వీనికి హల్త్వము దృఢమగునని చెప్పనగును.

ఇఁక నీ సూత్రసప్తకముచే నుపదేశింపఁబడిన పందొమ్మిది వర్ణములచేఁ బ్రాచీనాక్షర సమామ్నాయమందలి యిరువదియేడు వర్ణములుమాత్రమే యభిప్రేతములుగాక

ప్రత్యాహారవర్ణములగు "క్ జ్ చ్ ట్ త్ మ్" అను నాతిం‌టిచే మిగిలిన "క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ త థ ద ధ ప ఫ బ భ" యను నిరువది స్పర్శములుగూడ నుపదేశింపఁబడినవే యగుచు నించుమించు వర్ణసమామ్నాయ మంతయు నుపదేశింపఁబడినట్లే యగును. దానంజేసి ప్రాచీ నాక్షర సమామ్నాయమందలి 'శ ష స' ల నుండి తొలఁగిన నలుపదియేడు వర్ణములును మాహేశ్వరసమామ్నాయమందలి 'శషస'ల నుండి తొలఁగిన ముప్పదితొమ్మిదివర్ణములు నుపదే శింపఁబడినవే యగుచున్నవి. దానంజేసి యీ సూత్ర సప్తకముచే నక్షర సమామ్నాయవిశేషమంతయు నుపదే శింపఁబడినదే యగుచుండుటవలన మిగిలిన సూత్రసప్తక ముచేఁ దొలిసూత్రసప్తకమునం దుపదేశింపఁబడిన యీ ఇత్సంజ్ఞావర్ణములచే సూచితమగు నర్థమే వివరింపఁబడుచున్న దని చెప్పవచ్చును. కావునఁ బైని నిరూపించిన సూత్రసప్త కమునందలి యిత్సంజ్ఞావర్ణములచే సూచితమగు నర్థమే యీ దిగువ వివరింపఁబడుచున్నది.

ఝ భ ఞ్ - ఘ ఢ ధ ష్.

ఈ రెండుసూత్రములందును ప్రాచీనాక్షర సమా మ్నాయమందలి 'కచటతప' వర్గములయొక్క చతుర్థవర్ణము లుపదేశింపఁబడుచున్నవి. తొలుతఁ జతుర్థవర్ణములను గ్రహిం చుటకుఁ గల కారణ మిదివఱకు వర్గములందలి పంచమాక్ష రములను గ్రహించి "ఞమఙణనమ్" అని యుపదేశించెను. ఆ వర్ణములకు సన్నిధియందుండిన "ఝభఘఢధ" అను వ

ములై ప్రథమోపస్థితికము లగుటంజేసి యియ్యవియే స్వీక
రింపఁబడినవి. ఆవర్గములను దొలుత స్వీకరించుటలో విశేషము
గోచరింప 'ఝభ' లొకసూత్రముగ 'ఝభఞ్' అనియు 'ఘ
ఢధ'లు వేఱొకసూత్రముగ 'ఘఢధష్' అని వేఱొకసూత్ర
ముగ నుపదేశింపఁబడినవి.

ఇఁక 'ఝభఞ్' అను సూత్రమున 'ఞ్' అను వర్ణ
మిత్సంజ్ఞకముగా నుపదేశింపఁబడియె. ఇందులకుఁ గారణమేమ
నఁగా నింతకుమున్న 'ఐఔచ్' అను సూత్రమున నుపదేశిం
పఁబడిన 'చ'కారమునకుఁ జ వర్గసూచకత్వము చెప్పఁబడి
యెను. చ కారముతో పాటు కటవర్గములు నుపదేశింపఁబడి
నవి. అట్లు 'క ట' వర్గములతో సంబంధించిన 'ఙణ' కారములు
ప్రయోజన విశేషము నభిలషించి యుపదేశింపఁబడినట్లు
నిర్వచింపఁబడియె. ఇఁక 'గట' వర్ణములతో పా టుపదేశింపఁ
బడిన చ కారమునకు సంబంధించిన ఞ కారము నుపదిష్టం
బగుటచే నా ఞ కారమును స్ఫురింపఁజేయ నీ సూత్రమున నా
ఞ కార ముపదేశింపఁబడియె.

'ఘఢధష్' అను సూత్రమున 'ష' కార మిత్సంజ్ఞక
ముగా నుపదేశింపఁబడియెను. ఇందలియాశయ మేమఁగాఁ
పై సూత్రపఠకముచేఁ బ్రాచీనాక్షర సమామ్నాయమునం
దును మాహేశ్వరసమామ్నాయమునందును గూడఁ దెలియ
వచ్చెడి వర్ణములలో 'శషస'లు తక్క తదితరవర్ణములన్నియు
భావితములగుచున్నవని చెప్పబడియెను. అట్లాసూత్రమునందు
భావింపఁబడని 'శ ష స' లను స్ఫురింపఁజేయఁ దన్మధ్యపతిత

వర్ణమగు షకార మిచట నిత్సంజ్ఞకముగా నుపదేశింపఁ బడినది. ఈ షకారము కాకాక్షిన్యాయముచే 'శ స' లను స్ఫురింపఁ జేయుటవలన 'శ ష స' లుగూడ నిచట నుపదేశింపఁ బడినవే యగుచున్నవి. ఇట్లే 'ఘ ఢ ధ ష్' అను తొమ్మిదవ సూత్రమున నీషకారము తొమ్మిదవయిత్సంజ్ఞావర్ణముగా నుప దేశించుటచే సంఖ్యాసామాన్యముగా నవపూర్వనుగు విశేష ముపదేశింపఁబడుచున్నది. అయ్యది యప్రస్తుతమగుటంజేసి విరమింపఁబడినది.

జ బ గ డ ద శ్.

ప్రాచీనాక్షర సమామ్నాయమందలి వర్గ చతుర్థా క్షరములు వివృతార్థకములుగాఁగ దత్సాన్నిధ్యవశమునఁద్రుతీ యాక్షరములగు జబగడదలు క్రమముగ బుద్ధ్యారూఢము లగుచున్నవి. జబగడదలన్నియుంచుకేనియు విశేషభేదమున కవకాశము నీయక యొకేసూత్రముగ నొప్పెడియవకాశమును గల్గియుండుటంజేసి 'జబగడదశ్' అను సూత్రముపదేశింపఁబడు చున్నది. ఇఁక 'జ బ గ డ ద శ్' అనుసూత్రమున 'శ' వర్ణ మిత్సంజ్ఞగా నుపదేశింపఁబడియె. ఇందుఁగలవిశేష మేమన షకారము నిదివరకు నిత్సంజ్ఞముగా నుపదేశించుట వలన నయ్యది మధ్యవర్ణముగాఁగల 'శ స' లలోఁ బూర్వపరశంక గల్గును. అందుఁ బూర్వవర్ణమును 'అభ్యర్హితం పూర్వమ్'ను న్యాయముచే శవర్ణమును స్ఫురింపఁజేయ నిందు శవర్ణమిత్సం జ్ఞగా నుపదేశింపఁబడియె. మఱియు శవర్ణ మూప్మలలో

మొదటివర్ణ మగుటంజేసి యట్టి యూష్మలను గణమును స్ఫురింపఁజేయుటకు నియ్యాది యుపదేశింపఁబడినది.

ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్.

ఇఁక స్పర్శములలో 'జ బ గ డ ద' ల యొక్క సాన్నిధ్యనశమునఁ దెలియవచ్చెడి వర్ణములు, 'ఛ ఫ ఖ ఠ థ' లు. ఈ 'ఛ ఫ ఖ ఠ థ' లంతకుముందువలెనే యీక్రమము ననుసరించినచోఁ బ్రక్రియయందొకింత బాధగల్గుటంజేసి యట్టి బాధ గలుగకుండ 'ఖ ఛ' లకు స్థానపరివర్తనము చేయ నట్టి బాధ వారించుటవలనను విశేషప్రయోజనము లభించుటవలనను 'ఖ ఛ' లకుఁ బరివర్తనముచేసి 'ఖ ఫ ఛ ఠ థ' యను క్రమముననుసరించెను. ఇట్టిద్వితీయాక్షరక్రమము ననుసరించి ప్రథమాక్షరములకుఁ గూడఁ గ్రమముననుసరించినచో వర్గప్రథమాక్షరములకుఁ 'క ప చ ట త' అనుక్రమముగూడ ననుమేయమే యగుచున్నది. దానంజేసి వర్గద్వితీయాక్షరములకు వర్గప్రథమాక్షరములను బొందికచేసిన 'ఖ ఫ ఛ ఠ థ క ప చ ట త' యను సూత్రమును యోజింప సమకట్టి భాషాప్రచారమును బరిశీలింప నందుఁ గపవర్ణములు ప్రతిబంధకములుగాఁ గన్పట్టె. అందుచేఁగపలను వేఱుసేసి "ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్" అను సూత్రము ననుసరించెనని యోజింపనొప్పును. దానిచేఁగల్గుప్రయోజనము శాస్త్రమునందు సర్వవిధముల దృష్టమగుచున్నది.

ఈ సూత్రమునందు 'వ' కార మిత్సంజ్ఞావర్ణముగా నుపదేశింపఁబడినది. ఈవకారమును గ్రహించుటచే 'య ర ల వ శ ష స' యను ప్రాచీనవర్ణ సమామ్నాయమందలి వర్ణ

ములందలి యపూర్వమగు మధ్యస్థితి సూచింపఁబడు చున్నది. ఎట్లన - 'యరల'వర్ణము లేస్థానక్రమము ననుసరించియున్నవో యాతీరుననే 'శషస' వర్ణములుగూడ నట్టి స్థానమును ననుసరించుచుండుటచే నీ యరల వర్ణములు శషస వర్ణములు ననుతులకు మధ్యస్థానముగా నలరారుచున్నవను నభిప్రాయమును సూచించుటయే గాక యంతస్థలయవధినిగూడ సూచించుటకై యయ్యది యుపదేశింపఁబడినది.

క ప య్.

స్పర్శాక్షరములలో మిగిలిన కపలు రెండును 'కపయ్' అను సూత్రముగా నుపదేశింపఁబడియెను. ఈ రెండువర్ణములచే వర్ణోత్పత్తిస్థానములలో నగ్రగణ్యములగు కంఠోష్ఠములు రెండును సూచింపఁ బడుచున్నవి. ఇంతియకాదు. స్పర్శవర్గములందు నాద్యంతవర్గములందలి యాద్యంతాక్షరము రెండుఁ బొందికచేయఁబడుటచేఁ బ్రాచీనసమామ్నాయమునందలి స్పర్శవర్గక్రమముగూడ విశేషముతోఁ జెప్పియుండి ప్రయోజనమును గనియున్నదనికూడఁ దెలియవచ్చుచున్నది.

ఇచట 'య్' అనునది యిత్సంజ్ఞావర్ణముగా నుపదేశింపఁబడుచున్నది. ఇయ్యది ప్రాచీన వర్ణ సమామ్నాయము నందలి స్పర్శవర్గాంతమందలి యాదివర్గసూచకమని యుత్తర సూత్రములగు 'శ ష స ర్, హ ల్' అను సూత్రములందలి యిత్సంజ్ఞావర్ణములను 'ర్ ల్' వర్ణములనుగూడఁ జూచినచో సువిజ్ఞేయ మగుచున్నది.

శ ష స ర్.

ఈ సూత్రమునందు 'శ ష స' లు ప్రాచీనాక్షర సమామ్నాయమునం దేక్రమమున నేతీరున నంతమునందు నిలిచియున్నవో యా తీరుననే యీ సూత్రములందునుగూడ నుపదేశింపఁబడుచున్నవి.

ఈసూత్రమున 'ర్' అను వర్ణ మిత్సంజ్ఞకముగా గ్రహింపఁబడినది. దీనిప్రయోజనము 'శ ప య్'సూత్రమునందలి యిత్సంజ్ఞావర్ణమగు యకారప్రస్తావమునందే నిర్వచింపఁబడినది. ఏమన, ప్రాచీనాక్షరసమామ్నాయమందలియకారాదులక్రమ మును స్ఫురింపఁజేయుటయే యని.

హ ల్.

పై పదునాలుగుసూత్రములచే భాషకు నభిప్రేతమగు వర్ణములన్నియుఁ బుష్కలముగా నుపదేశింపఁబడినవను నానందముచే నొకపరి యీపదునాలుగుసూత్రములను సింహావలోకనమును జేయను, 'హయవరట్' సూత్రమున నుపదేశింపఁబడిన 'హ'కారముచే "శలఇగుపధాదనిటఃక్సః (పా. 3-1-45) మున్నగుసూత్రములందలి 'శల్, రల్' ఝల్, వల్' మొదలగు ప్రత్యాహారములయందు హకారము గ్రహింపఁబడక పోవుటచేఁ బ్రక్రియకు బాధగలుగ నట్టిబాధను దొలఁగింపను నీసూత్రమును 'హల్' అని ప్రత్యేకముగా నంతిమసూత్రముగా నుపదేశించెను. ఇందొక విశేషముగూడఁ గలదు. ప్రాచీనాక్షర సమామ్నాయమునందు 'శ ష స' వర్ణములతోపాటు 'హ' కార ముచ్చరింపబడినక్రమముననే యిచటఁ

గూడ 'శషస' వర్ణముల కనంతరము 'హ' కార ముపదేశింపఁ బడుచున్నది.

ఇట్లుపదేశించుచు అకార హకారముల మధ్యముననే సకలవర్ణములున్నవని ప్రాచీనవర్ణసమామ్నాయమున కవిరుద్ధముగ నున్నట్లు చెప్పఁబడియెను. ప్రాచీనవర్ణసమామ్నాయమునకును మాహేశ్వర సమామ్నాయమునకును గల సజాతీయధర్మమెద్దియన- ఆదియం దకారమును నంతమునను 'శషసహ'లు నెట్టిమార్పును లేకుండఁ బ్రయోగింపఁబడియుండుట. అకారము మొదలు శవర్ణమువఱకునుండు వర్ణములన్నియు విశేష ప్రయోజనము నభిలషించి మాహేశ్వరసూత్రములం దద్భుతమగు క్రమమున నుపదేశింపఁబడియున్నట్లు సుస్పష్టము.

ఈసూత్రమునందు 'ల్' అను వర్ణమిత్సంజ్ఞగా నుపదేశింపఁబడియెను. అద్దానియొక్క ప్రయోజన మంతస్థములయందలి క్రమము ప్రాచీనాక్షరానుగుణమే యని నిర్ణయించుటయే.

ఇఁకఁ బ్రాచీనాక్షరసమామ్నాయమునందుఁ చివరియ వచ్చెడి 'ళ క్ష' యను వర్ణము లీ మహేశ్వరసూత్రములం దుపదేశింపఁబడియుండలేదు. ఏలయన భాషాప్రచారమున 'ళ' కారమును లకారతుల్యముగను క్షవర్ణమును 'కష' యోగజనితముగను గ్రహించుటచే భాషాప్రయోజనము సిద్ధించుటవలన లాఘవమునకై బిందువిసర్గములతో పాటివ్వియు నుపేక్షింపఁబడినవని యూహింపవచ్చును. కాని పర్యాలోచనము చేసిన ళకారక్షకారములు ణకారమువలె మూర్ధన్యములగుచు విశేష ప్రయోజనములతో పాటొప్పారుచుండుట

